


# అతనికి ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను నేర్పండి

దూరప్రదేశాలను గురించి తెలుసుకోవాలనుకుంటే మీ బిడ్డ మిమ్మలనే అడుగుతాడు. మీ దగ్గర నుండి అనేక ముఖ్య విషయాలు నేర్చుకుంటాడు. అందులో ఒకటి ఫోర్‌హాన్స్‌తో సరియైన దంతసంరక్షణ. అది ఎట్లా తన పళ్ళను కాపాడుతుందో, ఎట్లా పంటిక్షయమును నివారిస్తుందో నేర్చుకుంటాడు.



ఒక దంతవైద్యునిచే నిర్మింపబడ్డ యీ టూత్ పేస్టులో బిగువైన పళ్ళకు ఇగుళ్ళకు కావలసిన ప్రత్యేక మందులున్నాయి. అవి మీకు, మీ బిడ్డకు మంచివి. అందుచేత, ఇప్పుడు ఇకముందు పళ్ళ జబ్బులు రాకుండ ఎట్లా కాపాడుకోవాలో అతనికి నేర్పించండి. ప్రతి ఉదయం, రాత్రి ఫోర్‌హాన్స్ వాడేటట్లు అతనిని ప్రోత్సహించండి. జీవితాంతం అవసరమైన దంతసంరక్షణ...ఇప్పుడే నేర్పించండి.

## జాగు చెయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి




ఉచితం: "పళ్లు ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అనే పుస్తకం. రంగుచిత్రాలలోనున్న ఈ పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. పది భాషల్లో దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 10 పై. బిళ్ళలు పంపండి. అడ్రసు: మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి-1.

పేరు.................................................

అడ్రసు.................................................

* మీకు కావలసిన భాష క్రింద గీతపెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

ఈ పుస్తకం అతడు చదివే పుస్తకాలలోకెల్లా ముఖ్యమైనది కావచ్చు

**ఫోర్‌హాన్స్** టూత్ పేస్టు—ఒక దంతవైద్యుడు నిర్మించినది

"C 1" CMGM-18 B TL

# చందమామ

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.


శేఖర్ ఫిలిమ్స్
గొల్లభామ
డైరెక్షన్
సి. పుల్లయ్య
నిర్మాతలు
సోమశేఖర్
రాధాకృష్ణ
– డిస్ట్రిబ్యూటర్స్ –
ఆంధ్ర... ......... రాయల
సీడెడ్... శ్రీ గౌరీ ఫిలిమ్స్.
నైజాం..... దివ్యదత్త ఫిలిమ్స్
SF-4


దిలీప్ బృందం
దీవికి పిక్నిక్
అరే, ఇంత ఆలశ్యం అయిందని అనుకోనే లేదే! మనం త్వరత్వరగా సర్దుకుని తిరిగి వెళ్ళిపోవాలి.
సార్, సార్ పడవలేదు!
తాడు వూడిపోయి కొట్టుకు పోయివుంటుంది. అయితే, అలలు ఈ వైపు కేవున్నాయి. కాబట్టి ఎంతోదూరం వెళ్ళివుండదు.
బాగా చీకటి పడింది. గాలి జోరుగా వుంది. అగ్గిపుల్లలు వెలిగించి లాభంలేదు.
ఆదుర్దాపడకండి. నా దగ్గర 'ఎవరెడి' టార్చి వుంది! పడవ ఎక్కడుందో వెంటనే కనిపెడ్దాం.
ఆఁ, అదిగో అక్కడుంది! దిలీప్, పడవపై టార్చి ఫోకస్ చేసివుంచు. నేను ఈదుకుంటూవెళ్ళి అందుకుంటాను.
అదిగో. దగ్గరకు చేరుకుంటున్నారు. బలేబలే.... పడవలోకి ఎక్కేస్తున్నారు. హమ్మయ్య, బ్రతికాం!
అవును, టీచరుకు, నా 'ఎవరెడి' టార్చికి ధన్యవాదాలు!
UC 2713

# ఇప్పుడే...
# మీ సహాయం
# అవసరం!

"మన మందరమూ ఒకే జాతికి చెందినవారము. మనమంతా ఒకే ప్రజ. బీహారు, ఉత్తరప్రదేశ్. ఇతర అనావృష్టి ప్రాంతాలలో వచ్చిన అపద యావద్భారతదేశానికే వచ్చిన అపద. మనమంతా కలిసి అనావృష్టి పరిస్థితుల్ని ఎదుర్కొనాలి. కష్టసుఖాలను మనమంతా కలిసి పంచుకోవాలి. ఉజ్వల భవిష్యత్తుకు మనం ఐక్యంగా కృషి చేయాలి."

**ఇందిరా గాంధి**
ప్రధాన మంత్రి

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధికి
ఉదారంగా విరాళ మివ్వండి.

విరాళాలను నగదు రూపంలో కానీ, వస్తు రూపంలో కానీ
ఈ క్రింది చిరునామాకు పంపండి.

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధి.
క్యాబినెట్ సెక్రటేరియట్, రాష్ట్రపతి భవన్,
న్యూ ఢిల్లీ - 4.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జీవితం మనుష్యులను ఏకం చేస్తుంది. వివిధ మతాలవారూ, జాతులవారూ కలిసి జీవించేటప్పుడు మతభేదాలూ, జాతిభేదాలూ జీవితానికి అడ్డుగోడలు కారాదు. అందుచేతనే జాతీయోద్యమం నడిపిన కాలంలో గాంధీజీ భారతీయులలో మతసామరస్యాన్నీ, అస్పృశ్యతా నివారణనూ ముఖ్యలక్ష్యాలుగా పెట్టుకున్నాడు. "సజీవమైన మసీదు" అన్న కథలో ఈ నీతినే తెలుసుకుంటాం.

ఈ సంచికతో "నెహ్రూ కథ" పూర్తి అవుతున్నది.

సంపుటి 40 జూన్ '67 సంచిక 6

CHITRA



# భారత చరిత్ర




మొట్టమొదట ఇంగ్లీషు నౌకాదళం ఫ్రెంచి నౌకలను పట్టుకున్నది. ఫ్రెంచివారికి యుద్ధ నౌకలు లేకపోయే సరికి, డూప్లే మారిషస్ దీవుల నుంచి ఎనిమిది యుద్ధనౌకలను తెప్పించాడు. ఇంగ్లీషు నౌకలు ఏ కారణం చేతనో ఫ్రెంచి నౌకలతో యుద్ధం చెయ్యక, మద్రాసు తీరాన్ని ఫ్రెంచివారి వాత వదిలి పెట్టి, బెంగాలులోని హుగ్లీకి ప్రయాణమై వెళ్ళిపోయాయి.

ఫ్రెంచివారు మద్రాసుపై సముద్రం దిక్కు నుంచీ, భూమి దిక్కు నుంచీ కూడా ముట్టడించారు. ఒక వారంలో మద్రాసు వారికి లొంగింది. ఈ ముట్టడిలో ఆరుగురు మాత్రమే చనిపోయారు.

కాని అంతటితో యుద్ధం ముగియ లేదు. కొత్తగా కర్ణాటక గవర్నరయిన అన్వారుద్దీన్ మద్రాసు వద్ద గల ఫ్రెంచి బలాల పైకి పెద్ద సేనను పంపాడు. అప్పటికే మద్రాసును ఆక్రమించుకున్న అల్ప సంఖ్య గల ఫ్రెంచిసేన నవాబుగారి పెద్ద సేనలను చెదరగొట్టింది. నవాబు సేనలు శాంతోమ్‌కు తిరోగమించి, అటుగా వచ్చిన అదనపు ఫ్రెంచి బలాల చేతిలో మరొక సారి ఓడిపోయాయి. ఈ అపజయాల ఫలితాలు తరవాత తెలుసుకుందాం.

ఇంతలో పెద్ద తుఫాను వచ్చి మద్రాసు తీరంలోని నౌకలు నష్టపడి, మద్రాసు విడిచి వెళ్ళిపోయాయి. డూప్లే మద్రాసును నిలువు దోపిడీ చేశాడు. ఫ్రెంచి నౌకాబలం వెళ్ళి పోగానే సముద్రతీరం తిరిగి ఇంగ్లీషువారి దయింది. డూప్లే ఫోర్ట్‌సెంట్‌డేవిడ్‌ను 18 మాసాలు ముట్టడించి కూడా జయించలేక పోయాడు. ఈ లోపల (1748 జూన్) ఇంగ్లండు నుంచి పెద్ద నౌకాదళం వచ్చి, పుదుచ్చేరిని సముద్రం మీది నుంచీ, నేల మీది నుంచీ కూడా ముట్టడించింది. కాని

## 69. డూప్లే తంత్రజ్ఞత



ఫ్రెంచివారికి ఓటమి సంభవించలేదు. ఇంతలో యూరపులో యుద్ధం ముగిసింది. ఇంగ్లాండుకూ, ఫ్రాన్సుకూ రాజీ అయింది. ఫ్రెంచివాళ్ళు మద్రాసును ఇంగ్లీషువారి పరం చేశారు.

ఈ సంఘర్షణ నుంచి డూప్లే గొప్ప గుణపాఠం నేర్చుకున్నాడు. దాని ఫలితంగా అతను ఒక కొత్త ఎత్తుగడ ప్రారంభించాడు. దేశీయులైన రాజుల మధ్య స్పర్థ లున్నప్పుడు ఎవరో ఒకరి పక్షం చేరి రెండవవాణ్ణి ఓడించి, లాభం పొందటం. అన్వారుద్దీన్ పంపిన అంత పెద్ద సేనా కొద్దిమంది పాశ్చాత్య సైనికుల చేతిలో దెబ్బతిన్నది. అందుచేత యుద్ధంలో సంఖ్యాబలం కన్న సైనికుల క్రమశిక్షణా, అధునాతన ఆయుధాలూ ముఖ్యం. ఆసియా సైన్యాలు ఈ రెంటిలోనూ వెనకబడినవి కావటం చేత కొద్దిపాటి యూరోపియన్ సైన్యాల ముందు కూడా నిలబడ లేవు. కొంతమంది దేశీయ రాజులకు సైనిక సహాయం చేసి, యుద్ధాల్లో వారిని గెలిపించి, వారి అండతో ఇంగ్లీషు వారిని తాను అణచివేయవచ్చునని డూప్లే ఆలోచన చేశాడు.

డూప్లేకు అదృష్టం కలిసి వచ్చింది కూడా. కర్నాటక, దక్కను సింహాసనాల కోసం




ఆ సమయంలో ఘర్షణలు సాగుతున్నాయి. కర్నాటక నవాబు కాగోరిన చందాసాహెబుతోనూ, నిజాము నవాబు కాగోరిన ముజఫర్ జంగ్‌తోనూ డూప్లే రహస్య ఒప్పందాలు చేసుకున్నాడు. (అసఫ్ జాహ్ నిజాముల్ ముల్క్ 1748 లో దక్కను రాజ్యం స్థాపించాడు. అతని అనంతరం అతని కొడుకు నాసిర్ జంగ్ నవాబయాడు. అయితే అసఫ్ జాహ్ మనమడైన ముజఫర్ జంగును మొగలు చక్రవర్తి దక్కను సుబేదారుగా నియమించాడు. ఆ కారణం చేత ముజఫర్ జంగ్ దక్కను సింహాసనాన్ని ఎక్క గోరాడు.)





1749 ఆగస్టు 3 న కర్నాటక సింహా సనం కోసం అంబూరు వద్ద యుద్ధం జరిగింది. అందులో అన్వారుద్దీన్ చనిపోయాడు. అతని కొడుకు ముహమ్మదాలీ తిరుచినాపల్లి పోయి దాక్కున్నాడు. తిరుచినాపల్లిని ముట్టుబెట్టటానికి ఒక ఫ్రెంచిదళం బయలుదేరి వెళ్ళింది.

డూప్లే ఎత్తుగడకు ప్రతిగా ఇంగ్లీషువారేమీ చేయలేకపోయారు. వారు ముహమ్మదాలీకి అండగా తిరుచినాపల్లికి కొంత బలాన్ని పంపారు. డూప్లే సహాయంతో ముజఫర్ జంగ్ దక్కనుకు అధిపతి అయి, కృష్ణకు దక్షిణాన ఉన్న మొగలు భూభాగానికి డూప్లేను గవర్నరుగా నియమించి, పుదుచ్చేరి పరిసరాలూ, ఒరిస్సా తీర ప్రాంతాలూ అతని పరం చేశాడు. సుప్రసిద్ధమైన మచిలీపట్టణం వర్తకనగరం కూడా డూప్లే పరమయింది. డూప్లే, తన కింద ఉన్న ఉద్యోగులలో అగ్రగణ్యుడైన బుస్సీనీ, కొంత ఫ్రెంచిసేననూ ముజఫర్ జంగ్ కింద కొలువుంచాడు. ఈ విధంగా నిజామ్ పరిపాలనలో ఫ్రెంచి వారికి గొప్ప ప్రాభవం ఏర్పడింది.

డూప్లే సాధించిన ఈ ఘనవిజయం అతని మిత్రులకూ, శత్రులకూ కూడా అత్యాశ్చర్యం కలిగించింది. తిరుచినాపల్లి దుర్గంలో తలదాచుకున్న ముహమ్మదాలీతో కూడా ఒక ఒప్పందానికి రాగలిగితే డూప్లే విజయం పరిపూర్ణమవుతుంది. తిరుచినాపల్లిని పట్టుకోమని డూప్లే పంపిన సేన తంజావూరును పట్టుకునే వ్యర్థప్రయత్నంలో పూర్తిగా చితికిపోయింది. అందుచేత డూప్లే యిక రాజకీయ తంత్రం ఉపయోగించ నిశ్చయించాడు.

అయితే ఈలోగా ఇంగ్లీషువారు ముహమ్మదాలీకి పెద్దసేనతో సహాయం వచ్చి, అతను డూప్లే ఎత్తులకు లొంగకుండా భీష్మించుకునేలాగా చూశారు.



# నెహ్రూ కథ

## 36

1947 వేసవిలో దేశమంతటా మారణ హోమం సాగింది. మానవరక్తం ఏరులై పారింది. స్త్రీల మానభంగాలూ, శిశు హత్యలూ, గృహదహనాలూ విచ్చల విడిగా సాగాయి. దేశమంతటా పైశాచికశక్తులు విలయతాండవం చేశాయి.

దేశవిభజనకు ముఖ్యమైన పార్టీలన్నీ అంగీకరించిన మీదట జూను 3 న లార్డ్ మౌంట్ బాటన్ దేశవిభజన ప్రకటించాడు. రాడ్‌క్లిఫ్ కమిషను భారత్, పాకిస్థాన్‌ల సరిహద్దులు నిర్ణయించటానికి నియోగించ బడింది. 1947 ఆగస్టు 15 స్వాతంత్ర్య దినంగా ప్రకటించారు.

ఇండియా, పాకిస్తానులు తమ తమ స్వాతంత్ర్యోత్సవాలు జరుపుకుంటూ ఉంటే పాకిస్తాను ప్రాంతం నుంచి లక్షలాది హిందువులూ, భారత ప్రాంతం నుంచి లక్షలాది ముస్లిములూ, ఇళ్ళూ, వాకిళ్ళూ, మానమూ, మర్యాదా కోల్పోయి కాందిశీకులై ఉభయ దేశాలకూ వచ్చారు. భారతదేశంలో ఈ కాందిశీకుల, శరణార్థుల భారం జవాహరు పైన పడింది.



దేశవిభజనా స్వాతంత్ర్యాలు ఎవరికీ ఆనందాన్ని చేకూర్చలేదు — బోలెడంత బాధ్యతను మాత్రమే తెచ్చాయి. పాకిస్తాను ఏర్పరచడం ద్వారా మతసమస్య పరిష్కారం కాకపోగా మరింత తీవ్రమయింది. కాశ్మీరు సమస్య అదనంగా వచ్చిపడింది.

స్వాతంత్ర్యం వస్తూనే పాకిస్తానువాళ్ళు కాశ్మీరుపైకి పఠాను ఆటవిక తెగలను ఉసికొల్పి, దారుణ హత్యాకాండ సాగింపజేశారు. భూలోకస్వర్గ మనిపించుకున్న కాశ్మీరు నరకప్రాయమయింది. ఈ దాడిముఠాలు, పాకిస్తాను సప్లయిచేసిన ఆయుధాలు ధరించి, శ్రీనగరుకు కొద్ది మైళ్ళ



దూరాన ఉన్న బారాములా దాకా వచ్చారు. బారాములా నగరంలో మూడువేలమంది హత్య అయారట. కాశ్మీరు లోయలో ఇంకా అనేక నగరాలు దాడి ముఠాల దుర్మార్గానికి బలి అయాయి. అప్పటికి భారతీయసేనలు ఈ ముఠాలను ప్రతిఘటించాయి.

జవాహరు కాశ్మీరు సమస్యను ఐక్యరాజ్య సమితికి నివేదించాడు. అలా జరగని పక్షంలో భారతీయసేనలు దాడి ముఠాలను పూర్తిగా తరిమికొట్టి ఉండేవే. కాని ఐక్య రాజ్యసమితి ద్వారా జవాహరు ఆశించిన న్యాయం జరగలేదు. సమస్య మొండి పడింది. యుద్ధం ఆగలేదు.



ఐ. రా. స. పరిశీలకులు వచ్చారు. కాశ్మీరు దాడులతో తమకు ప్రమేయం ఉన్నట్టు పాకిస్తాను ఒప్పుకోవలిసి వచ్చింది. 1949 జనవరి 1 న యుద్ధవిరమణ జరిగింది. కాని ఆ యుద్ధం ఐ. రా. స. రంగానికి మారింది.

1948 జనవరి నెలన మహాత్మాగాంధి హత్య జరిగింది. న్యూఢిల్లీలోని బిర్లాభవనంలో గాంధీజీ సాయంకాలపు ప్రార్థనలకు వెళుతూ ఉండగా నథూరాంగోడ్సే అనే వాడు ఆయనను కాల్చి చంపాడు. గాంధీజీ తన మానవాదర్శాలకు బలి అయాడు. దేశం స్వతంత్రమైన పద్ధతి గాంధీజీని బాధించింది. ఆయన ఆదర్శాలన్నీ ఆ విధానంలోనే ఆహుతి అయాయి. ఢిల్లీలో జరిగిన ఉత్సవాలకు ఆయన రాలేదు సరికదా, ఆ రోజు ఆయన దేశంలోనే లేడు—తూర్పు పాకిస్తాన్‌లో ఉన్నాడు.

గాంధీజీ మరణం దేశమంతటికీ ఒక దారుణమైన అనుభవం. జవాహరుకు కూడా అది పెద్ద దెబ్బే. కాని అతనిపైన అపారమైన బాధ్యత లున్నాయి. స్వదేశ సంస్థానాలను లీనం చెయ్యటమూ, పారిశ్రామికంగానూ, వైజ్ఞానికంగానూ దేశాన్ని ముందుకు తీసుకుపోవటమూ, ప్రపంచ రాజ్యాల మధ్య

భారతదేశానికి ఖ్యాతి చేకూర్చటమూ, అన్ని దేశాలతోనూ స్నేహసంబంధాలు ఏర్పాటు చేసుకోవటమూ, అంతర్జాతీయ రంగంలో భారతదేశం యొక్క అభిప్రాయానికి గణన ఉండేలాగు చూడటమూ—ఇలాటి పను లన్నీ జవాహరు ఎంతో దక్షతతో, సమర్థ వంతంగా నిర్వహించాడు. అతను అనేక దేశాలు పర్యటించి అంతులేని ప్రజాభి మానాన్ని చూరగొన్నాడు.

1950 జనవరి 26 న భారతదేశం స్వతంత్ర రిపబ్లిక్ అయింది. జవాహరు దానికి అగ్రనాయకుడుగా ఉండి, అంతర్జా తీయ రాజకీయ రంగంలోని ప్రముఖులలో ఒకడుగా పరిగణన పొందటం భారతీయు లకు ఎంతో గర్వకారణ మయింది. అతని హయాంలోనే ఫ్రెంచి వలసలూ, గోవా మొదలైన పోర్చుగీసు వలసలూ భారత దేశంలో చేరిపోయాయి.

తొలి స్వతంత్ర భారత ప్రధాని పండిట్ జవాహర్లాల్ నెహ్రూ కథను ఇంతటితో నిలిపి వేస్తున్నాం. అతని ఘనతను కొనియాడుతూ అంతర్జాతీయ విఖ్యాతిగల గమాల్ అబ్దుల్ నాసర్, ప్రెసిడెంట్ టిటో, లుడ్విగ్ ఎర్ హర్ట్, బండారనాయకా, లార్డ్ అట్లీ, లార్డ్ మౌంట్‌బాటన్, లార్డ్ పెథిక్‌లారెన్స్, లార్డ్



బాయిడార్, బెర్ట్రండ్ రసెల్, ఇల్యా ఎహ్రెన్ బూర్గ్, సర్వేపల్లి రాధాకృష్ణ, మొదలైనవారు వ్యాసాలు రాశారు.

నెహ్రూజీవితం లోని ప్రధాన సంఘట నలను ఒకసారి తిరిగి జ్ఞాపకం చేసు కుందాం.

1889-నవంబరు 14 న అలహాబాదులో జననం. తండ్రి మోతీలాల్, తల్లి స్వరూప్ రాణి.

1910-కేంబ్రిజ్‌లో విద్యాపరిసమాప్తి.

1916-ఫిబ్రవరి 8 న కమలా కౌల్ తో వివాహం.

1917-నవంబరు 19 న ఇందిర జననం.

1920-జలియన్ వాలాబాగ్ హత్యాకాండ ఫలితంగా గాంధీజీ సహాయ నిరాకరణో ద్యమం కేసి మొగ్గుదల. సెప్టెంబరు 4 న కలకత్తాలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక సమావేశానికి డెలిగేట్‌గా వెళ్ళాడు.

1921-డిసెంబరు 6 న మొదటిసారి అరెస్టు. 5 మాసాల ఖైదు శిక్ష.

1922-మార్చి 3న జైలు విడుదల. మే 11న తిరిగి అరెస్టు. అగస్టులో విడుదల, వెంటనే మళ్ళీ అరెస్టు.

1926-మార్చిలో విదేశీ యాత్ర, భార్య తోనూ, కుమార్తెతోనూ సహా. ఈ యాత్రలో సోవియెట్ రష్యా పర్యటన.

1927-డిసెంబరు, ఇండియాకు తిరిగి రాక. మద్రాసులో కాంగ్రెసు మహాసభ. కాంగ్రెసు వైఖరిని సంపూర్ణ స్వాతంత్ర్యం కేసి మళ్ళించటం.

1929-డిసెంబరు 29న లాహోరు కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షత.

1930-శాసనోల్లంఘన సందర్భంలో అరెస్టు.

1931-మోతీలాల్ మరణం. జవాహర్ విడుదల—డిసెంబరు 26న.

1936-ఫిబ్రవరి 28 న కమల మరణం. ఎన్నికలలో పోటీ చేయటానికి కాంగ్రెసు నిర్ణయం. జవాహర్ కాంగ్రెసు ప్రచారం చేస్తూ దేశసంచారం (45,000 మైళ్ళు) అధిక రాష్ట్రాలలో కాంగ్రెసు విజయం.

1938-జవాహర్ తల్లి మరణం.

1939-ద్వితీయ ప్రపంచయుద్ధం ఆరంభం. మిత్రమండలి తరపున సహాయపడ టానికి భారతదేశం స్వతంత్రం కావాలని జవాహరు ఉద్ఘాటన.

1942-క్విట్ ఇండియా ఉద్యమం. కాంగ్రెసు నాయకుల అరెస్టు.

1945-బ్రిటనుకూ, భారతదేశానికీ మధ్య సంప్రతింపులు.

1947-దేశవిభజన. భారతస్వాతంత్ర్యం.

—(అయిపోయింది)






# పాతాళదుర్గం

## 14

[విరూపుడు నల్లగరుడపక్షి చేత నరవానరాన్ని కింద పడకొట్టించాడు. తరవాత అందరూ తెప్పల మీద పొట్టిరాక్షసుడున్న చోటుకు చేరారు. రాక్షసుడి వెంట వున్న స్త్రీ పులిందుడి భార్యకాదని తేలిపోయింది. రాక్షసుడు వాళ్ళను శిధిలదేవాలయంలోకి తీసుకుపోయి, అక్కడ కందకంలో వున్న పెద్దపెద్ద మొసళ్ళనూ, సర్పాలనూ చూపించాడు. తరవాత—]

ధూమకుడు కందకంలోని మొసళ్ళనూ, సర్పాలనూ కొంచెంసేపు పరీక్షగా చూశాడు. ఆతడి కొక అనుమానం కలిగింది. శిధిల దేవాలయం ఆవరణలోని చెట్ల మీదున్న మృగాల్లాగే, యివీ మహాకలి రాక్షసుడి బంట్ల పెంపుడు జంతువులు కాదు గదా? పైగా, పొట్టిరాక్షసుడన్నట్టు, పాతాళదుర్గానికి పోవాలంటే వున్న ఒకే ఒక మార్గం యిదెలా అవుతుంది? వాడేదో తమందరినీ చులకనగా తీసుకుని, అవహేళన పరుస్తూ మాట్లాడుతున్నాడు...

ధూమకుడు యిలా ఆలోచించి, ఒక నిశ్చితానికి వచ్చి, పొట్టిరాక్షసుడి కేసి గుచ్చి గుచ్చి చూస్తూ, "పాతాళదుర్గాన్ని చేరేందుకు, ఈ కందకంలో వున్న జంతువుల మధ్యగా వెళ్ళవలసి వుంటుందన్న నీ మాటలు సత్యంలాగే కనబడుతున్నవి. ఆ మార్గం నీకు బాగా పరిచయం అయిందీ,



అలవాటయిందీ కూడా గనక, నువు ముందుండి దారి తియ్యి. మేం అందరం నీకు వెనకగా వస్తాం," అంటూ ఈటె పైకెత్తి, పొట్టిరాక్షసుడు వెనక్కు తిరిగి పారి పోయేందుకు వీలులేకుండా అతడి వెన్నుకు ఆనించాడు. అదే క్షణంలో సోమకుడు బాణాన్ని రాక్షసుడి తలకు గురి చేశాడు.

పొట్టిరాక్షసుడు, ధూమక సోమకుల కేసి భయపడుతూ చూసి, "మీరు మాట తప్పుతున్నారు. నాతో ఎలాంటి శత్రుత్వం లేదన్నారు గదా? ఇప్పుడు ఈటే, బాణం నా మీద ప్రయోగించి, నన్నెందుకు చంపాలని చూస్తున్నారు?" అని అడిగాడు.



"నా మొగుణ్ణి చంపకండి. పుటక్కు రాక్షసుడైనా మనుషుల్లో కూడా యింతకన్న మంచివాడూ, నమ్మకస్తుడూ వుండడు. నా మాట నమ్మండి," అంటూ పొట్టిరాక్షసుడి ఆటవిక భార్య ధూమక సోమకుల్ని బతిమాల సాగింది.

"నీ మొగుడి మంచితనం యిదేనా? మేం పాతాళదుర్గానికి మార్గం చెప్పమంటే, మమ్మల్ని యీ క్రూరజంతువులున్న కందకంలో దిగి పొమ్మంటున్నాడు! అందుకే ముందతణ్ణి దిగి దారి చూపెట్టమన్నాను. ద్రోహానికి ద్రోహమే ప్రతీకారం!" అన్నాడు ధూమకుడు, ఈటెను పొట్టిరాక్షసుడి వెన్ను మీద బలంగా అదుముతూ.

పొట్టిరాక్షసుడు ఒక చిన్న కేక పెట్టి, "నీ యీటె సూదికన్నా వాడిగా వున్నట్టుంది, అంత గట్టిగా గుచ్చకు. నీ తోటి మానవ స్త్రీ చెప్పేమాట ఎందుకు నమ్మవు? నేను దుర్మార్గుణ్ణయితే, ఆ మహాకలి రాక్షసుడి సేవలోనే వుండి, నీ బోటి వాళ్ళను కాల్చుకుతింటూ హాయిగా బతికేవాణ్ణి. సరే, మీ అందరికీ కావలసింది పాతాళదుర్గానికి పోయే దారేకదా? ముందే చెప్పాను, మీలో ఏ ఒక్కరూ అక్కణ్ణించి తిరిగి రాలేరు. మీ ఖర్మకు నేనేం చేసేది!"



అంటూ కందకం గోడ మీద గాలికి కిర్రు కిర్రు మంటూ రాసుకుంటున్న చెట్లకొమ్మ ల్లోంచి ఒక బలమైన తాటి మోకును వెతికి బయటికి లాగాడు.

"మహాకలి రాక్షసుడి ముఖ్య సేవకులు కొద్దిమందికి మాత్రమే, యీ రహస్యం తెలుసు. ఈ మోకు ఆధారంతో కందకం లోకి—ఆ బయిటికి పొడుచుకొచ్చిన రాయి వరకూ దిగి, ఆ రాయిని కాలితో బలంగా నొక్కితే, లోపలి నుంచి ఒక వెడల్పాటి రాతిపలక ముందు కొస్తుంది. దాని మీదికి మీ రందరూ నిర్భయంగా దిగొచ్చు. ఆ రాతి పలక బయటపడే చోట ఒక సొరంగ మార్గం వుంటుంది. దాని వెంటపోతే, మీరు మహా కలి రాక్షసుడు అధికారం చెలాయించే దండ కారణ్య ప్రాంతం చేరుతారు. అంత దూరం వెళ్ళిన తరవాత వాడి పాతాళదుర్గం కను క్కోవటం ఏ మంత కష్టం కాదు. మీలో ఎవరు ముందుగా ఈ మోకు పట్టుకుని కందకంలోకి దిగుతారు?" అని అడిగాడు పొట్టిరాక్షసుడు.

ధూమకుడికి యిందులో ఏదైనా మోసం వుండవచ్చునన్న అనుమానం కలిగింది. రాక్షసుడు చెప్పినట్టు ఆ మోకుతో కందకం గోడలో వున్న సొరంగ మార్గం చేరినా,




ఆ దారి తమను సురక్షితంగా దండకారణ్య ప్రాంతం చేరుస్తుందన్న నమ్మకం ఏ ముంది? అంతేకాక మోకు మధ్యలోనే తెగటం జరి గితే, అది పట్టుకుని కందకంలోకి దిగేవాడు మొసళ్ళ నోళ్ళల్లో పడిపోతాడు!

ధూమకుడు, రాక్షసుడి చేతిలో వున్న తాటి మోకు కేసి చూస్తూ, ఏమో అన బోయేంతలో పులిందుడు పెద్దగా గొంతెత్తి, "ధూమకదొరా! ఈ బుడంకాయ రాక్షసుడి మాటలు నమ్మకు. వీడు మాయలమారి. ఈ అడదాన్ని చూస్తున్నకొందికీ నాకు ఈవి డలో నా పదో పెళ్ళాం పోలికలు కనిపిస్తు న్నవి," అన్నాడు.





మాట మాటకూ పులిందుడు తన పదో పెళ్ళాం సంగతి తీసుకురావటం ధూమకుడికి మొదటి నుంచీ కోపకారణంగానే వున్నది. చావుబతుకుల సమస్యలో తా ముంటే, యీ భిల్లుడికి పోయిన తన పడుచు పెళ్ళాం తప్ప, మాట్టాండేందుకు లోకంలో మరొక సంగతే వున్నట్టు లేదు.

ధూమకుడు, పులిందుడితో మంచిగా, "పులిందా, నీ వింతవరకూ చేసిన సహాయానికి కృతజ్ఞుణ్ణి. ఇక నీవు నీ గూడేనికి తిరిగి పోవచ్చు. నీ తెప్పల్ని కూడా తీసుకుపో. నీ భార్య పాతాళదుర్గంలో మహాకలి చెరలో వున్నదనే దాంట్లో సందేహం లేదు. రాజకుమార్తెతోపాటు, ఆమెనూ తప్పక తీసుకువస్తాం," అన్నాడు.

ధూమకు డిలా అనగానే పులిందుడు మహా సంతోషపడిపోతూ, "ధూమకదొరా, మంచి మాట చెప్పావు. పోయింది పోనే పోయింది, యిక వున్న తొమ్మిది మంది భార్యల రక్షణ అయినా చూసుకోవాలి గదా? ఇక నేను నా గూడేనికి తిరిగి పోతాను. ఏమన్నా సహాయం కావాలంటే కబురు చెయ్యండి. పాతాళదుర్గం చేరిన తరవాత, నా పెళ్ళాం సంగతి మర్చిపోయేరు సుమా?" అంటూ కందకం దగ్గిర నుంచి బయలుదేరి, నది కేసి నడిచాడు.

ధూమకుడు నెత్తి మీది నుంచి పెద్ద భారం దిగి పోయినట్టు ఒక నిట్టూర్పు విడిచాడు. పొట్టిరాక్షసుడు ఏ హెచ్చరికా లేకుండానే మోకు పట్టుకుని జర్రున కందకంలోకి జారి, దాని గోడలో వున్న ఒక రాతిని కాలితో గట్టిగా నొక్కాడు. మరుక్షణం ఒక పెద్ద రాతి పలక బయటికొచ్చింది. రాక్షసుడు దాని మీది కెక్కి నిలబడి, ధూమకుడూ వాళ్ళతో, "చూశారు గదా? యిందులో మోసం ఏమీలేదు. కింద వున్న విషజంతువులు యింత ఎత్తు ఎగరలేవు. ఇక అంతా మోకు పట్టుకుని దిగిరండి," అన్నాడు.







అప్పటికి ధూమకుడి సంశయాల్లో కొన్ని నివారణ అయినై. అందరూ రాతిపలక పైకి దిగారు. అక్కడ వారికి మెట్లున్న ఒక సొరంగ మార్గం కనిపించింది.

"ఈ సొరంగ మార్గం ద్వారా మీ రొక గంట ప్రయాణంలో దండకారణ్యం చేర గలరు. ఇదే ప్రయాణం, ఆ కనబడే కొండ దారుల వెంట అయితే నాలుగైదు నెలల కాలం పట్టవచ్చు. మార్గంలో మీరు అనేక కష్టాలను ఎదుర్కోవలసి రావటమే గాక, దారి తప్పి బయలుదేరిన చోటుకే తిరిగి వచ్చే ప్రమాదం కూడా వుంటుంది," అన్నాడు పొట్టిరాక్షసుడు.

ధూమకుడు, సోమకుడి కేసీ విరూపుడి కేసీ చూశాడు. ఆ ఇద్దరూ సొరంగ మార్గంలో ప్రవేశించటానికి సిద్ధమన్నట్టు నిలబడ్డారు. ధూమకుడు, పొట్టిరాక్షసుడికి కృతజ్ఞత చెప్పి, "రాక్షసుల్లో కూడా మంచి వాళ్ళుంటారని నిన్ను చూసిం తరవాత గట్టి నమ్మకం కలిగింది. కుంభీరుడనే మీ వాణ్ణి ఎరుగుదువా? అతడే మా రాజ కుమార్తె కాంతిసేనను దొంగిలించుకు పోయింది," అన్నాడు.

"అతణ్ణెరక్కేం? మాంత్రికుడొకడు వాడి కొమ్ము విరగ్గొట్టాడు. వాళ్ళిద్దరూ హోరాహోరి పోట్లాడారట. ఆ మాంత్రికు





డుండేదీ దండకారణ్యంలోనే. మహాకలికీ వాడికీ బద్ధవైరం. ఒకళ్ళగొంతొకళ్ళెప్పుడో కోసుకుంటారు," అన్నాడు పొట్టిరాక్షసుడు.

అంతలో కందకం పైనుంచి రాక్షసుడి భార్య, "నువ్వు కూడా వాళ్ళతో పడి మీ వూరు పోదామనుకుంటున్నావా? పైకి రావేం!" అంటూ కళ్ళెర్ర చేసి కేక పెట్టింది. రాక్షసుడు గతుక్కుమని, "ఈ గయ్యాళెప్పుడో నా గొంతు కురెడుతుంది!" అని ధూమకుడి చేతులు పట్టుకుని, "నా సంగతి దండకారణ్యంలో నర రాక్షసు లెవరికీ చెప్పకండి, సరేనా?" అంటూ మోకు పట్టుకుని గబగబా కందకం గోడపైకి పాకిపోయాడు.



విరూపుడూ, సోమకుడూ రాతిపలక మీంచి సొరంగమార్గపు మెట్ల కేసి పోబో యేంతలో ధూమకుడు వాళ్ళను వారించి, "మనం సొరంగమార్గాన దాదాపు గంట ప్రయాణం చేయవలసి వుంటుంది గదా, వెలుగు లేకుండా అదెలా సాధ్యం? రాక్షసబ్బంట్లు యీ మార్గానే పాతాళదుర్గానికి వెళ్ళే మాట నిజమైతే, వాళ్ళు ఉపయోగించే దివిటీలు మెట్ల దగ్గిర ఎక్కడో వుంటవి, ముందు ఒకళ్ళు వెళ్ళి వెతకండి," అన్నాడు.

సోమకుడు సొరంగంలోకి పోయి ఒకటి రెండు నిమిషాల తరవాత మూడు నాలుగు దివిటీలూ, అవి వెలిగించేందుకు ఉపయోగించే చెకుముకి రాయీ, దూదీ తీసుకుని ధూమకుడి దగ్గిరకు వచ్చాడు. ధూమకుడూ, విరూపుడూ రాతిపలక మీంచి సొరంగంలోకి దిగారు. వెంటనే రాతిపలక తపీమని సొరంగ మార్గాన్ని మూసేశింది.

ఒకటి రెండు నిమిషాల తరవాత ముగ్గురూ దివిటీలు వెలిగించుకుని సొరంగ మార్గాన బయలుదేరారు. ముఖ్యమార్గం విశాలంగా దారి తప్పటానికి వీలులేకుండా వున్నది. కాని, దాని నుంచి అక్కడక్కడా చిన్నచిన్న మార్గాలు కొన్ని పక్కలకు పోతున్నవి. వాటిని పరీక్షించటానికిపోయిన విరూ





పుడికి, ఒకచోట రెండు మూడు మానవ కంకాళాలు కనిపించినై. రాక్షసుడి సేవ కుల నుంచి తప్పించుకు పారిపోయేం దుకు ప్రయత్నించి, ఆ నిర్భాగ్యులు దారీ తెన్నూలేని ఆ ఇరుకు ప్రదేశంలో చిక్కు కుని మరణించి వుంటారని విరూపుడు భావించాడు.

ఏ దుస్సంఘటనా లేకుండా ఓ అర గంటకాలం ధూమకుడూ అతడి అనుచరు లిద్దరూ సొరంగంలో చాలాదూరం నడి చారు. వాళ్ళు ఒక మలుపు తిరిగేసరికి దూరంగా వాళ్ళకు తమ కేసే వస్తున్న దివి టీలు కొన్ని కనిపించినై. ధూమకుడు చప్పున వెనుదిరిగి మలుపుచాటుకు వచ్చి, తన చేతిలోని దివిటీని నేలకుకొట్టి ఆర్పి వేస్తూ, సోమకుణ్ణీ, విరూపుణ్ణీ కూడా అలాగే చేయమన్నాడు. తరవాత ముగ్గురూ ప్రధాన సొరంగమార్గం వదిలి, పక్కల మన్న ఒక చిన్నసందులో దాక్కున్నారు.

క్రమంగా దివిటీలు ధూమకుడూ వాళ్ళున్న ప్రాంతానికి వచ్చినై. ఆ దివిటీల వాళ్ళంతా కలిసి ఇరవైమంది వుంటారు. అందరికన్న ముందు ఒక రాక్షసుడు నడుస్తున్నాడు. ఆ తరవాత వున్నవాళ్ళంతా మహాకలికి చిక్కి, అతడి సేవలో చేరిన




మానవవ్యక్తులు; అందరికీ వెనకగా మరొక రాక్షసుడు. ముందున్న రాక్షసుడు పెద్ద గొంతుతో ఏదో పాట పాడుతున్నాడు. తతిమ్మావాళ్ళు చిన్న గొంతులతో వంత పాడుతున్నారు. వాళ్ళు ధూమకుడున్న చోటు చేరి, సూటిగా ముందుకు చూస్తూ నడిచిపోసాగారు. అందరూ ఆ ప్రదేశం దాటిన తరవాత, వెనకవున్న రాక్షసుడు ముక్కుపుటాలు ఎగరవేస్తూ, "ఎక్కడో దివిటీలారిన పొగవాసన వేస్తున్నది," అన్నాడు అందరూ వినేంత బిగ్గరగా.

ముందు నడుస్తున్న రాక్షసుడు విను క్కుంటూ, "ఇన్నిరకాల పొగవాసన

లున్నయ్యా? మన దివిటీల నుంచి వచ్చే దేమన్నా, సాం(బాణిపొగా? అతితెలివికి పోక త్వరగా నడిచిరా," అని కేకపెట్టాడు.

వెనక నడుస్తున్న రాక్షసుడు మారు మాటాడకుండా తతిమ్మావాళ్ళని అనుస రించిపోయాడు. ధూమకుడూ అతడి స్నేహితు లిద్దరూ [ప్రాణగండం తప్పి నంతగా సంతోషించారు. దివిటీ రాక్ష సబృంట్లు సారంగమార్గం వెంట కంటికి కనబడకుండాపోగానే, ధూమకుడూ వాళ్ళు దాక్కున్నచోటు నుంచి బయిటికి వచ్చి, మళ్ళీ దివిటీలు వెలిగించుకుని, ఈసారి మరింత జాగ్రత్తగా ముందుకు పోసాగారు.

పావు గంటకాలం గడిచింది. సారంగ మార్గం యిప్పుడు లోగడవున్నంత చీకటి మయంగా లేదు. ఎక్కడి నుంచో లోనికి వెలుగు [ప్రసరిస్తున్నది. "ఇక, మనం దివి టీలు ఆర్పేయవచ్చు, సారంగ ద్వారం సమీపిస్తున్నాం," అన్నాడు ధూమకుడు.

వాళ్ళు ముగ్గురూ దివిటీలు ఆర్పి, వాటిని సారంగంలోవున్న పెద్ద కంతల్లో ఒక చోట దాచి, నిశ్శబ్దంగా ముందుకు నడి చారు. ఒక మలుపు తిరిగేసరికి సూర్య కాంతి కళ్ళను మిరుమిట్లు కొల్పుతూ సారంగద్వారం నుంచి లోపలికి పడు తున్నది. ముగ్గురూ వేటాడే పులుల్లా నక్కుతూపోయి సారంగద్వారం చేరేందు కున్న రాతిమెట్లెక్కి, ద్వారం పక్కలనున్న రాళ్ళచాటు నుంచి ముందుకు చూశారు. అక్కడ ఎదురైన దృశ్యం వాళ్ళను నిలు వునా కంపింపజేసింది. ఒక మహాకాయు డైన రాక్షసుడు రంగురంగుల చర్మాలతో కుట్టిన దుస్తులు ధరించి, నెత్తిన కిరీటంతో, చేతిలో పెద్ద ముళ్ళగద ఎత్తి పట్టుకుని, ఏనుగులు పూన్చిన రథంలో అరణ్య మార్గాన పోతున్నాడు. అతని రథానికి వెనకగా సాయుధులైన రాక్షసులనేక మంది నడుస్తున్నారు. —(ఇంకా వుంది)





# పారని తంత్రం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మంత్రతంత్రాలను నమ్ముకున్నందు వల్ల ఒక్కొక్కసారి ఊహించని పరిణామాలు కలుగుతాయి. తంత్రం చేసేది ఒకరైతే ఫలితం మరొకరిదవుతుంది. ఇందుకు నిదర్శనంగా నీకు భోజరాజు కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

విజయపురిని ఏలే భోజరాజుకు మంజుళ అనే కుమార్తె ఉండేది. కొడుకైనా, కూతురైనా ఆ పిల్ల ఒక్కతే గనక రాజు ఆమెను అమిత గారాబంగా పెంచాడు. ఆమెకు యుక్తవయసు వచ్చింది. ఆమెను చేసుకునే వాడు ఆమె తండ్రి రాజ్యానికి కూడా వారసుడవుతాడు గనక, ఆమెకు మంచి సంబం

## బేతాళ కథలు



ధాలే వచ్చాయి. కాని అవేవీ ఆమెకు నచ్చ లేదు. తన కుమార్తెకు నచ్చనివాణ్ణి తెచ్చి బలాత్కారంగా పెళ్ళిచేసే ఉద్దేశం భోజ రాజుకు ఎంత మాత్రమూ లేదు.

ఇలా ఉండగా ఒకనాడు రాజకుమార్తె తన పరివారంతో రాజోద్యానానికి వెళ్ళి ఇంటికి తిరిగి వచ్చి, తనకు భర్త కాదగిన వాణ్ణి తాను ఆ సాయంకాలం చూశాననీ, అతన్ని తప్ప తాను మరెవ్వరినీ పెళ్ళాడననీ తండ్రికి తెలిపింది.

రాజు చిక్కులో పడ్డాడు. తన కుమార్తె కళ్లచూసి వరించిన యువకు డెవరో, అతని పేరేమిటో, వంశ మేమిటో, ఎక్కడ ఉంటాడో, ఎలా జీవిస్తాడో ఏమీ తెలియదు. అతను మంజుళను పెళ్ళాడటానికి తగునో, తగడో నిర్ణయించే ముందు అతణ్ణి పట్టుకో వలసి ఉన్నది.

రాజు మంత్రిని సలహా అడిగితే, మంత్రి మర్నాడు రాజుగారు నగరం వీధులన్నీ ఊరేగటానికి ఏర్పాట్లు చేసి, నగరంలో ఉండే వారెవరైనా సరే రాజుగారి దర్శనం చేసుకుని తమ తమ కష్టాలు చెప్పుకొన వచ్చు నని చాటింపు వేశాడు. ఈ ఊరే గింపు చూసే జనంలో రాజకుమార్తె వరిం. చిన యువకుడు కనబడతాడని మంత్రి ఆలోచన.

అయన ఎత్తు పారింది. మర్నాడు రాజు తన కుమార్తెతో సహా ఏనుగు అంబారీలో ఎక్కి నగరపు వీధులన్నీ తిరుగుతుండగా మంజుళ తాను వరించిన యువకుణ్ణి ఒక చోట చూసి, తన తండ్రికి చెప్పింది. రాజు తన భటులలో చురుకైన వాళ్లను దగ్గిరికి పిలిచి, రాజకుమార్తె చూపిన యువకుణ్ణి గురించి దొరికినన్ని వివరాలు సంపాదించుకు రమ్మని ఆజ్ఞాపించాడు. రాజుగారు ఊరే గింపు పూర్తిచేసి రాజభవనం చేరే సరికల్లా వాళ్ళు ఆ యువకుణ్ణి గురించి సాధ్యపడి నంత సమాచారం తీసుకొచ్చారు.



ఆ కుర్రవాడి పేరు సర్వదాయి. అతని తల్లిదండ్రు లెవరో అతనికే తెలియదు. ఎవరో ముసలిది అతన్ని ఈ నగరానికి తెచ్చి పెంచింది. ఆ ముసలిది పోయి చాలా ఏళ్ళయింది. కుర్రవాడు చాలా అందంగానూ, ఆకర్షవంతంగానూ ఉండటంచేత చుట్టుపక్కల ఉండే వాళ్ళందరూ అభిమానించి, ఆ దిక్కు లేని బిడ్డకు ఏ లోటూ లేకుండా చూస్తూ వచ్చారు. కొంతకాల మయాక గురుశుశ్రూష చేసి ఆ కుర్రవాడు చదువుకున్నాడు. అతడు అందకాడే గాక బుద్ధిమంతుడు కూడా. అందుచేత అతనికి తెలిసినవాళ్లంతా ఆప్తులే.



ఈ సమాచారం విని రాజు తన కుమార్తెతో, "అమ్మా, నువు నీ మనసు మార్చుకో. ఈ సర్వదాయిది ఏ వంశమో కూడా తెలీదు. పట్టి అనాథ జీవి. ఎంతలేసి రాజకుమారులనూ కాదని నువ్వా కుర్రవాణ్ణి పెళ్ళాడితే నిన్ను లోకం పరిహసిస్తుంది. అతన్ని నా రాజ్యానికి వారసుణ్ణి చేశానంటే నేను నలుగురిలోనూ మరి తల ఎత్తుకు తిరగటానికి ఉండదు," అన్నాడు.

"మీరు లక్ష చెప్పండి. నేనా అబ్బాయిని తప్ప మరెవర్నీ పెళ్ళాడను. అతన్ని పెళ్లాడలేకపోతే చచ్చిపోతాను," అన్నది మంజుళ.

రాజు ఈ మాట విని నిలువునా నీరైపోయి, మంత్రిని పిలిపించి సలహా అడిగాడు. మంత్రి ఆ రాత్రల్లా ఆలోచించి, మర్నాడు ఉదయానికి ఒక గొప్ప ఆలోచన రాజుగారికి విన్నవించాడు. అదేమిటంటే—

పదిహేను పదహారేళ్ల క్రితం కాశ్మీరు రాజవంశంలో స్పర్ధలు పుట్టుకొచ్చి, ఒక వర్గం శత్రువులకు అనుకూలం కావటమూ, రాజభవనంలో తిరుగుబాటు సాగటమూ, అడవులకు పారిపోయిన రాజునూ, నాలుగైదేళ్ల వయస్సు గల రాజకుమారుణ్ణీ శత్రుసైనికులు వేటాడి హత్య చేయుటమూ జరిగాయి. ఆ కాశ్మీరు రాజకుమారుడి హత్య వాస్త



వంగా జరగలేదనీ, అతను ప్రచ్ఛన్నంగా ఎక్కడో బతుకుతున్నాడనీ ఒక పుకారు చుట్టుపక్కల రాజ్యాలలో లేవదీయాలి. సర్వదాయికి ఉండే పుట్టుమచ్చలు మొదలైనవి ఆ కాశ్మీరు రాజకుమారుడికి ఉండినట్టు ప్రచారం చెయ్యాలి. సర్వదాయే ఆ కాశ్మీరు రాజకుమారుడన్న మాట జనంలో నుంచే పుట్టేటట్టు చెయ్యాలి. ఆ తరవాత మంజుళను అతని కిచ్చి పెళ్ళి చేస్తే పదిమందీ హర్షిస్తారేగాని, ఎవరూ తప్పు పట్టరు.

మంత్రి చేసిన ఈ ఆలోచన రాజుకు అమోఘంగా కనబడింది. ఈ పుకార్లు పుట్టించే బాధ్యత కూడా రాజు మంత్రికే వదిలిపెట్టి, తన కుమార్తె దగ్గిరికి వెళ్ళి, "అమ్మా, నీకూ, నీవు కోరిన వాడికీ పెళ్ళి జరిగిందే అనుకో! దాని కిక అడ్డేమీ ఉండదు. నాకు మాత్రం ఒక సంవత్సరం గడువియ్యి. వచ్చే ఏడు ఈ పాటికి గాని మీ ఇద్దరి పెళ్ళి వైభవంగా జరిపించటానికి తగిన పరిస్థితి ఏర్పడదు," అన్నాడు.

రాజకుమార్తె అందుకు సరే నన్నది.

ఈ లోపల మంత్రి కొందరు వేగులవాళ్లను చుట్టుపట్ల దేశాలకు పంపాడు. వాళ్ళు అక్కడక్కడా సత్రాలలోనూ, రచ్చలలోనూ కనిపించిన జనంతో, "మాది కాశ్మీరుదేశం. మేము మా పాత మహారాజుగారి కొడుకు కోసం దేశాలన్నీ గాలిస్తున్నాం. అందరూ అనుకున్నట్టు అతను అరణ్యంలో చావలేదు. అతని ముసలి దాది అతన్ని కాపాడి ఈ ప్రాంతాలకు వచ్చిందన్నారు. ఆ కుర్రవాడికి కుడిచెవి కింద ఒక పుట్టుమచ్చ ఉంటుంది. ఇంకా ఫలానా ఫలానా లక్షణా లుంటాయి," అంటూ ప్రచారం చేశారు.

ఈ పుకార్లు ఇతరుల ద్వారా విజయపురికి కూడా చేరాయి. కాశ్మీరు రాజకుమారుడి లక్షణాలు విన్నవాళ్ళు సర్వదాయిలో ఆ లక్షణాలుండటం గమనించి, "మన సర్వ




దాయే ఆ కాశ్మీరు యువరాజు కాడు గదా!" అని ఆశ్చర్యపడ్డారు. అనుమానం క్రమంగా దృఢపడి ఆ నోటా ఆ నోటా, "సందేహం లేదు. శత్రువుల నుంచి తప్పించుకున్న ఆ కాశ్మీరు రాజకుమారుడే మన మధ్య అనాథగా తిరుగుతున్నాడు. విధి ఎంత విచిత్రమైనది!" అన్నారు.

సర్వదాయి మేలు కోరినవాళ్ళు, "సర్వదాయికి మళ్ళీ మంచి రోజులు తప్పక వస్తాయి. అందుచేతనే అతని జన్మరహస్యం ఇలా బయటపడింది. ఏ రాజకుమార్తె అతన్ని పెళ్ళాడటానికి ఎగిరి గంతెయ్యదు? ఆ తరవాత అతను తన మామగారి సహాయంతో తన రాజ్యాన్ని క్షణంలో తిరిగి గెలుచుకుంటాడు," అన్నారు.

సర్వదాయికి కూడా ఆ పుకారులో విశ్వాసం కుదిరింది. అతను తిరిగి రాజు కావటానికి ఎదురు చూడసాగాడు.

అతని నమ్మకానికి తగ్గట్టే ఇద్దరు రాజులు తమ కుమార్తెల చిత్తరువులను దూతల ద్వారా అతని వద్దకు పంపి, తమ కుమార్తె నచ్చినట్టయితే అతని కిచ్చి పెళ్ళి చెయ్యటానికి సిద్ధంగా ఉన్నామని కబురు చేశారు. సర్వదాయి ఇద్దరు రాజకుమార్తెల చిత్తరువులూ చూసి, అందులో కనకపురం రాజకుమార్తెను మోహించి, ఆమెను పెళ్ళాడటానికి సమ్మతించాడు.

పరిస్థితి ఇంతదాకా వచ్చాక భోజరాజుకు ఇక తాను తన కుమార్తెను సర్వదాయి కిచ్చి పెళ్ళి చేయవచ్చుననీ, ఎవరూ ఆక్షేపించరనీ ధైర్యం కలిగింది. అందుచేత అతను సర్వదాయిని తన ఇంటికి పిలిపించి, తన కుమార్తెను చూపించి, "నువు నా కింది పౌరుడివే కనక పెళ్ళి కోసం దేశాంతరం పోనవసరం లేదు. నా కుమార్తెనే ఇచ్చి పెళ్లి చేస్తాను, చేసుకో," అన్నాడు.

"నన్ను మన్నించాలి. నేను అదివరకే మరొక రాజకుమార్తెకు నా మనసూ, మాటా

కూడా ఇచ్చేశాను," అని చెప్పి సర్వదాయి సెలవు పుచ్చుకున్నాడు.

సర్వదాయి తనను నిరాకరించాడని తెలియగానే మంజుళ మూర్ఛపోయి, ఆ మూర్ఛలోనే ప్రాణాలు వదిలింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మంజుళ దుర్మరణానికి ఎవరు బాధ్యులు? ఆమెను నిరాకరించిన సర్వదాయా? ఒక సంవత్సరం లోపుగా అతన్ని తెచ్చి ఆమెకు పెళ్ళి చేస్తానని ఆమెను నమ్మించిన రాజా? అతను ఒక ప్రచ్ఛన్న రాజకుమారుడని లోకాన్ని నమ్మించటానికి తంత్రం నడిపిన అతని మంత్రా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇందులో సర్వదాయి తప్పేమీ లేదు. అతను రాజకుమార్తెను ప్రేమించవలిసిన అవసరమేమీ లేదు. అతను పెళ్ళాడకపోతే చచ్చిపోతానని రాజకుమార్తె మొదటనే చెప్పింది. ఆమె తండ్రి తప్పుకూడా ఏమీలేదు. మంత్రి సలహా ఇవ్వటానికి అశక్తుడైన పక్షంలో తన కూతురి తృప్తి కోసం ఆయన ఒక అనామకుడికైనా ఆమెనిచ్చి ఉండేవాడే. తప్పు మంత్రిది. ఆయన తంత్రం ఆలోచించినప్పుడు కనీసం సర్వదాయికైనా తన ఎత్తుగడ తెలియనిచ్చి ఉండవలసింది. సర్వదాయి తానొక అజ్ఞాత యువరాజు ననుకోకపోతే మంజుళను ఒక్కనాటికి నిరాకరించి ఉండకపోను. అనుపానం తెలియకుండా గొప్ప ఔషధాన్ని వాడే వైద్యుడిలాగా మంత్రి గొప్ప తంత్రమే పన్నాడుగాని, దాని సాఫల్యం గురించి ఎలాటి జాగ్రత్తా పడక పోయాడు. అందుచేతనే మంజుళ దుర్మరణం పాలయింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# సుల్తానుగారి పిల్లి

విసార్ అనే నగరంలో మహమ్మద్ అనే వర్తకుడుండేవాడు. అతను ఒకసారి రకరకాల సరుకులు కొని, అనేకమంది నౌకర్లను ఏర్పాటు చేసుకుని, బిడారుతో సహా వర్తకానికి బయలుదేరాడు. అనేక చోట్ల ఆగుతూ, తన సరుకు అమ్ముతూ, కొత్త సరుకులు కొంటూ అనేక మాసాలు ప్రయాణం చేసి అతను ఒక కొత్త నగరానికి వచ్చాడు.

ఆ నగరంలో కొంతకాలం విశ్రాంతి తీసుకుందామనుకుని, ఒక సత్రంలో మహమ్మద్ తన నౌకర్లతో సహా బస ఏర్పాటు చేసుకున్నాడు. అక్కడ అతను తింటూ, తాగుతూ విశ్రాంతి తీసుకుంటూండగా ఒక వర్తకుడు అతని వద్దకు వచ్చి, "అయ్యా, తమరు దూరదేశం నుంచి వచ్చినట్టున్నారు. తమకిక్కడి మర్యాదలు ఏమీ తెలియవులాగుంది," అన్నాడు.

"నేను కొత్తవాణ్ణి. ఈ నగరపు మర్యాదలేమిటో చెప్పండి, తెలుసుకుంటాను," అన్నాడు మహమ్మద్.

"ఈ నగరానికి వచ్చే ప్రతి వర్తకుడూ మంచి మంచి కానుకలు పట్టుకుపోయి సుల్తానుగారి దర్శనం చేసుకోవాలి. ఆ కానుకలు పుచ్చుకుని సుల్తానుగారు ఆ వర్తకుణ్ణి తనతో చదరంగం ఆడటానికి ఆహ్వానిస్తారు. అదే ఇక్కడి మర్యాద," అన్నాడు ఆ నగరపు వర్తకుడు.

అందుచేత, తనకే మాత్రమూ ఇష్టం లేకపోయినా, మహమ్మద్ సుల్తానును చూడక తప్పలేదు. అతను ఒక బంగారపు పళ్ళెంలో, తన వద్ద ఉండే అమూల్యమైన వస్త్రాలు కొన్ని పెట్టుకుని, సుల్తాను భవనానికి వెళ్ళాడు.

సుల్తాను ఆ కానుకలన్నిటినీ స్వీకరించి, మహమ్మద్ స్వదేశం గురించీ, అతని

---

వి. రామమోహనరావు




పర్తకం గురించీ, అతను తిరిగిన దేశాలను గురించీ అడిగి తెలుసుకుని, "ఇవాళ రాత్రి మా ఇంటికి వచ్చెయ్యి; చదరంగం ఆడుకుందాం," అన్నాడు.

మహమ్మద్ చీకటి పడగానే రాజభవనానికి వెళ్ళాడు.

"ఆట నియమం చెబుతాను విను. నా దగ్గిర ఒక తెలివైన పిల్లి ఉన్నది. అది తెల్లవార్లూ తన తోక మీద ఏడు దీపాలను నిలిపి ఉంచగలదు. మనం ఆట ఆడుతున్నంతసేపూ అది కదలకుండా ఆ దీపాలను తన తోక మీద నిలిపి ఉంచినట్టయితే నీ ఆస్తి అంతా నాది అవుతుంది; నిన్ను బందిఖానాలో పెట్టిస్తాను. కాని అలా కాక నా పిల్లి ఏ మాత్రం కదిలి, ఏ ఒక్క దీపం కిందపడినా నన్ను నీ యిష్టం వచ్చినట్టు చెయ్యవచ్చు, నా ఖజానా అంతా నీదే!" అని సుల్తాను మహమ్మద్‌తో అన్నాడు.

పాపం, మహమ్మద్ ఏం చెయ్యగలడు? పారిపోవటానికి లేదు, చదరంగం ఆడననటానికీ లేదు; సుల్తాను నియమాల ప్రకారం ఆడి తీరాలి, చచ్చి తీరాలి. ఈ పాడు దేశంలో అడుగు పెట్టినందుకు మహమ్మద్ తనను తాను తిట్టుకున్నాడు. అతనికి తన సొత్తు మీదా, ఇంటి మీదా, ప్రాణాల మీదా ఆశపోయింది.

సుల్తాను తన తెలివైన పిల్లిని రప్పించి, ఒక చోట కూర్చోబెట్టి, దాని తోక మీద ఏడు ప్రమిద దీపాలు నిలబెట్టించాడు. తరవాత సుల్తానూ, మహమ్మదూ చదరంగం ఆట మొదలుపెట్టారు.

మహమ్మద్ ఎత్తులు వేస్తూ, మధ్యమధ్య పిల్లి కేసి చూస్తున్నాడు. అది బొమ్మ పిల్లి లాగా నిశ్చలంగా కూర్చుని ఉన్నది.

మూడు రాత్రులూ, మూడు పగళ్ళూ ఆటసాగింది. పిల్లి కదలనే లేదు. మహమ్మద్ ఇక భరించలేక, తాను ఆడలేననీ, ఓడాననీ ఒప్పుకున్నాడు.

సుల్తాను సత్రం నుంచి వర్తకుడి సరుకులూ, డబ్బూ తెప్పించి, వర్తకుణ్ణి బంధించి, కారాగృహంలో పెట్టించాడు.

అక్కడ మహమ్మద్ భార్య జరీనా తన భర్త కోసం ఎంతోకాలం ఎదురు చూసింది. అతనైతే రాలేదు గాని, అతని నౌకరు ఒకడు మట్టిగొట్టుకుని తిరిగి వచ్చి, ఆమెకు జరిగినదంతా వివరంగా తెలియజేశాడు.

అంతా విని జరీనా తన భర్తను బంధవిముక్తుణ్ణి చెయ్య నిశ్చయించుకున్నది. ఆమె బోలెడన్ని ఎలుకలను పట్టించి, ఒక పెట్టెనిండా పెట్టించింది. కొంత బంగారం వెంట తీసుకుని, మగవాడి దుస్తులు ధరించి, ఒక బిడారుతో సహా బయలుదేరి, సుల్తానుండే నగరానికి వెళ్ళింది.

అక్కడ ఆమె సత్రంలో విడిది చేసి, కొందరు నౌకర్లను సత్రంలోనే ఉండమని మరి కొందరు నౌకర్లను వెంటబెట్టుకుని, ఒక బంగారుపళ్ళెం నిండా కానుకలుంచి, సుల్తాను భవనానికి పట్టించుకు పోయింది. తాను సుల్తానుతో చదరంగం ఆడేటప్పుడు, ఒక్కొక్క ఎలుకనే తామున్న గదిలోకి వదలమని ఆమె తన వెంట ఉన్న నౌకర్లను ముందుగా హెచ్చరించింది.

సుల్తాను జరీనాను చూసి మగవాడనే అనుకున్నాడు.



అయన ఆమె తెచ్చిన కానుకలు స్వీకరించి, నియమాలు తెలిపి, ఆమెను చదరంగం ఆటకు అహ్వానించాడు.

ఇద్దరూ చదరంగం ఆడేటప్పుడు పిల్లి వచ్చి, తన తోక మీద ఏడు దీపాలూ నిలిపి, రాతిబొమ్మలాగా కదలామెదలక నిశ్చలంగా కూర్చున్నది.

అంతలో గోడ చాటున వున్న జరీనా నౌకర్లు, చదరంగం ఆట జరిగే గదిలోకి ఒక ఎలుకను వదిలారు.

పిల్లి ఆ ఎలుకను చూసింది. దాని కళ్ళు మెరిశాయి. దానికా ఎలుకను పట్టాలన్న ఉద్రేకం కలిగింది.

కాని సుల్తాను పిల్లి కేసి తీక్షణంగా చూశాడు. పిల్లి తన ఆరాటాన్ని నిగ్రహించుకుని ఎప్పటిలాగే కూర్చున్నది.

కొంచెంసేపు జరగనిచ్చి, జరీనా నౌకర్లు మూడు నాలుగు ఎలుకలను వదిలారు. అవి చదరంగం ఆట జరిగే గదిలో అటూ ఇటూ కంగారుగా పరిగెత్త సాగాయి. వాటిని చూసేసరికి పిల్లికి నిగ్రహం పూర్తిగా పోయింది. అది తానున్న చోటు నుంచి ఒక్క దూకు దూకి ఎలుకల వెంట పరిగెత్తింది. దాని తోక మీది ఏడు దీపాలూ కింద పడిపోయాయి.

మరుక్షణమే జరీనా మనుషులు లోపలికి వచ్చి, సుల్తానును పట్టుకుని, చావ బాద సాగారు. సుల్తాను కేకలు పెట్టాడు. అయన నౌకర్లు అ కేకలు విని కూడా రక్షించటానికి రాలేదు. పరమ క్రూరుడూ, నీచుడూ అయిన తమ సుల్తానంటే వాళ్ళకు కూడా అసహ్యమే.

జరీనా సుల్తానును బంధించి, కారాగృహంలోకి తోయించి, ఆ కారాగృహంలో బంధితుడై ఉన్న తన భర్తనూ, అతని లాంటి మరికొందరినీ విడుదల చేయించి, తన భర్తతో సహా స్వదేశానికి తిరిగి వెళ్ళిపోయింది.





# జడబుద్ధి

కావేరీతీరాన ఒక అగ్రహారంలో గోవర్ధనుడనే బీదవాడుండేవాడు. ఆయనకు లేకలేక ఒక కొడుకు కలిగాడు. తల్లిదండ్రులా కుర్ర వాడికి శ్రీవర్ధను డని పేరు పెట్టి, గారాబంగా పెంచసాగారు.

చిన్నప్పటి నుంచీ శ్రీవర్ధనుడు మందమతిగానే ఉండేవాడు. ఉన్నచోటనే ఎంతసేపైనా ఉండిపోయేవాడు. ఎవరన్నా లేవమంటేగాని లేచేవాడుకాడు. రమ్మంటే వచ్చేవాడు, పొమ్మంటే పోయేవాడు. భోజనం చెయ్యమని ఎవరో ఒకరు చెబితేనేగాని భోజనంకూడా చేసేవాడుకాడు. చివరకు వాడు పడుకోవాలన్నా ఎవరో ఒకరు, "పడుకో," అని చెప్పాలి.

చదవేస్తే ఈ మందకొడి తనం కాస్త తగ్గుతుందని, తండ్రి శ్రీవర్ధనుణ్ణి గురుకులానికి పంపేశాడు. పన్నెండేళ్ళపాటు ఆ కుర్ర వాడు గురువుగారి దగ్గిర ఉండి కూడా కొంచెమైనా మారలేదు. కాని గురువుగారు చెప్పినదల్లా చేసేవాడు. గురువుగారు చదవమంటే చదివేవాడు, ఫలానాపని చెయ్యి అంటే ఆ పని చేసేవాడు. వాడి బుద్ధికి చలనం లేదన్నమాటే గాని వాడు సోమరిపోతుకాదు. అందుచేత చెప్పిన ఏ పని అయినా శ్రీవర్ధనుడు చక్కగానే చేసేవాడు. పన్నెండేళ్ళపాటు వాడి చేత అడ్డమైన పనులన్నీ చేయించుకోపటం చేత గురువుకు వాడంటే చాలా ఇష్టంగా ఉండేది. పన్నెండేళ్ళు పూర్తి అయాక గురువుగాసు, "ఇక వెళ్ళు, నా దగ్గిర చేసినట్టే చెప్పిన పనులు శ్రద్ధగాచేస్తూ అభివృద్ధిలోకి రా!" అని దీవించి శ్రీవర్ధనుణ్ణి ఇంటకి పంపేశాడు.

పన్నెండేళ్ళు గురుశుశ్రూషచేసి వచ్చినా, తన కొడుకులో కొంచెమైనా మార్పు లేక పోవటం చూసి తండ్రి శ్రీవర్ధనుడి చేత ఇంటి పనులు చేయించాడు. శ్రీవర్ధనుడి తల్లికి

అర్. అంజనేయులు



కంటిచూపు పోయింది. అతని తండ్రే వంట దగ్గిరనుంచీ చేసుకుంటున్నాడు. కొడుక్కు ప్రతి చిన్నపనీ చెప్పి చేయించుకోవటం ఆయనకు చాలా విసుగనిపించింది. ఈడొచ్చిన తన కొడుక్కు పెళ్ళి చేసేస్తే అవచ్చే పెళ్ళామే వాడికి పనులు చెప్పి చేయించుకుంటుంది, తనకు పూటపూటా చెయ్యి కాల్చుకునే పనీ తప్పుతుందనుకుని, గోవర్ధనుడు తన కొడుక్కు ఒక బుద్ధిమంతు రాలైన పిల్లను చూసి పెళ్ళి చేసేశాడు.

భార్య కాపరానికి వచ్చాక శ్రీవర్ధనుడికి బొత్తిగా పనిలేకుండా పోయింది. అతను అస్తమానమూ ఒకే చోట కూర్చుని ఉండే వాడు. శ్రీవర్ధనుడి భార్యతో మామగారు, "నీ మొగుడికి పనులు చెప్పి చేయించుకో," అని అన్నాడేగాని, భర్తకు పనులు చెప్ప టానికా పిల్ల సందేహించింది.

తన కొడుకు అస్తమానమూ చట్రాయిలా కూర్చుని ఉండటంచూసి తండ్రి, "నీభార్య ఏమన్నా చెయ్యమంటుందేమో, కనుక్కొని పనులు చేసిపెట్టరా," అని శ్రీవర్ధనుణ్ణి హెచ్చరించాడు.

అతడు భార్యవద్దకు వెళ్ళి, "ఏమన్నా పని ఉంటే చెప్పు, చేస్తాను," అన్నాడు.

"పెద్దవాళ్ళు పనులు చెప్పాలి, చిన్న వాళ్ళు చెయ్యాలి. ఏమన్నా పని చెబుతా రేమో అత్తయ్యనడగండి," అన్నది భార్య.

శ్రీవర్ధనుడు తల్లిదగ్గిరికిపోయి, "ఏమన్నా పని ఉంటే చెప్పమ్మా, చేస్తాను," అన్నాడు.

"గుడ్డిదాన్ని నాకేం తెలుస్తుందిరా? మీ నాన్నను అడుగు," అన్నది తల్లి.

"నా భార్యా, అమ్మా ఏమీ పనులు చెప్పటంలేదు. ఏంపని చెయ్యమంటావో నువే చెప్పు," అన్నాడు శ్రీవర్ధనుడు తండ్రితో.

"నా కర్మకొద్దీ పుట్టుకొచ్చావు! నేను నీకేం పని చెప్పేది? వెళ్ళి దేవుణ్ణి గురించి తపస్సు చెయ్యి. దేవుడనుగ్రహిస్తే ఏదైనా

వరమన్నా ఇస్తాడు," అన్నాడు తండ్రి ప్రాణంవిసిగి.

శ్రీవర్ధనుడు అడవికి పోయి తపస్సు ప్రారంభించాడు. కొంతకాలానికి దేవుడు ప్రత్యక్షమై, "నీ తపస్సుకు మెచ్చాను. ఏం వరం కోరుతావో కోరుకో," అన్నాడు.

"ఏంవరం కోరుకోమంటారో మా ఇంట్లో వాళ్ళను అడిగి వస్తాను. నువ్వెక్కడే ఉండు, దేవుడూ!" అంటూ శ్రీవర్ధనుడు పరమానందంతో ఇంటికి వెళ్ళి, తండ్రితో, "నువు చెప్పినట్టే తపస్సు చేశాను. దేవుడు కనిపించి వరం కోరుకోమన్నాడు. ఏంవరం కోరుకోమంటావు?" అన్నాడు.

"ఇంత ఐశ్వర్యం కావాలని కోరుకోక పోయావా? చిన్నప్పటి నుంచీ దరిద్రపు బతుకేగదా మనది? ఆ మాత్రం కూడా తెలీదా?" అన్నాడు తండ్రి.

ఇంతలో తల్లి కొడుకు అన్న మాటలు విని, "నాయనా, నాకు కళ్ళు రావాలని దేవుణ్ణి అడగరా," అన్నది.

తరవాత భార్య అతన్ని అవతలికి పిలిచి, "మనకు పిల్లలు కలగాలని కోరండి," అని చెప్పింది.

అందరితోనూ, "అలాగే, అలాగే," అని చెప్పి శ్రీవర్ధనుడు తాను తపస్సు చేసిన చోటికి పరిగెత్తుకు వచ్చాడు. కాని అక్కడ



దేవుడు కనిపించలేదు. దేవుడి కోసం వెతు కుతూ అతను అడవి అంతా కలయ దిరు గుతూ, ఒకచోట తపస్సు చేసుకునే మునిని చూసి, "అయ్యా, ఇంతకు ముందు నాకు ప్రత్యక్షమైన దేవుడు ఇటుగా గాని వచ్చాడా?" అని అడిగాడు.

ఆ మాటకు ముని ఆశ్చర్యపడి శ్రీవర్ధ నుణ్ణి వివరా లడిగాడు. అంతా విని ఆ ముని, "దేవుడు ప్రత్యక్షమైతే ఏదో వరం అడగక, ఆ దేవుణ్ణి ఉండమని నువు ఇంటికి వెళ్ళి వచ్చావా? ఎక్కడైనా పడి చావలేక పోయావూ?" అన్నాడు, దేవుణ్ణి ప్రత్యక్షం చేసుకున్నా డన్న అసూయ కొద్దీ.

శ్రీవర్ధనుడు ముని చెప్పిన ప్రకారం ఎక్కడైనా పడి చావ నిశ్చయించి చుట్టూ చూస్తే కొంత దూరంలో నిటారుగా ఉన్న ఒక కొండ కనిపించింది. దానిపై నుంచి పడి చద్దామనుకుని శ్రీవర్ధనుడు ఆ కొండ మీదికి ఎక్కసాగాడు.

మధ్య ప్రాంతంలో ఒక కోయవాడు కనిపించి, "కొండపైన ఏమీ లేదే, ఎందు కెక్కుతున్నావు?" అని అడిగాడు.

"పైనుంచి కింద దూకి చావటానికి," అంటూ శ్రీవర్ధనుడు కోయవాడితో కథ అంతా సవిస్తరంగా చెప్పాడు.

కోయవాడు అంతా విని, "ఏం మనిషి వయ్యా? నిన్ను దేవుడు వరం కోరుకో మన్నాడు గాని దాన్ని తనతో చెప్పమన్నాడా? నువు చెప్పకపోతే దేవుడికి నీ కోరిక తెలీదా? వెళ్ళు, ఇంటికి వెళ్ళు. మీ అందరి కోరికలూ దేవుడే తీరుస్తాడు," అన్నాడు.

కోయవాడు చెప్పిన ప్రకారం జడబుద్ధి అయిన శ్రీవర్ధనుడు ఇంటికి తిరిగి వచ్చాడు. ఇల్లంతా సమస్త సంపదలతో కళకళ లాడు తున్నది. తల్లికి చూపు కూడా వచ్చేసింది. శ్రీవర్ధనుడు చాలా సంతోషించాడు. మరొక ఏడాది తిరిగేసరికి అతని భార్య బిడ్డతల్లి కూడా అయింది.





# సజీవమైన మసీదు

ఉత్తరదేశంలో ఒక నగరాన్ని ఒక సుల్తాను ఏలుతూండేవాడు. ఆ నగరంలోనే ఒక ప్రసిద్ధుడైన ఫకీరు ఉండేవాడు. అతను వైద్యంలో సిద్ధహస్తుడు. అతని చేత్తో ఇచ్చిన మందుకు తిరుగు ఉండేది కాదు, ఎలాంటి కఠినవ్యాధులూ నయమయేవి.

అందుచేత రాజ్యంలోని ముసల్మానులూ, హిందువులూ కూడా అతని దగ్గిరికి వచ్చి మందు పుచ్చుకునేవారు.

ఫకీరు మందు లిచ్చినందుకు డబ్బు అడిగేవాడు కాదు. కాని ధనికులు అతని వద్ద చికిత్సలు పొందినప్పుడు తమ శక్తికొద్దీ డబ్బిచ్చేవాళ్ళు. రెండు మతాలకు చెందిన వాళ్ళూ అతని పైన అభిమానం చూపే వాళ్ళు. అతను కూడా అందరినీ ఒకే విధంగా చూసేవాడు.

కొంతకాలానికి ఫకీరు దగ్గిర చాలా డబ్బు పోగయింది. దాన్ని అతను ఏదైనా సత్కార్యానికి వినియోగించ నిశ్చయించి, సుల్తాను వద్దకు వెళ్ళి, తనకు ఎక్కడైనా కొంత స్థలం ఇప్పించమని వేడుకున్నాడు.

ఫకీరు ఇల్లు వేసుకుంటాడు కాబోలు ననుకుని సుల్తాను అతనికి కొంత స్థలం మంజూరు చేశాడు.

ఫకీరు తన వద్ద ఉన్న డబ్బు ఖర్చు చేసి, సుల్తాను మంజూరు చేసిన స్థలంలో ఒక మసీదు కట్టించాడు. అతను కూడా అస్తమానమూ ఆ మసీదులోనే ఉంటూ తన వైద్యవృత్తిని ఎప్పటిలా సాగించు కుంటూ వచ్చాడు.

ముసల్మానులు తండోపతండాలుగా ఆ మసీదుకు వచ్చి, దైవప్రార్థనలు చేసి, తమకు కావలిసిన మందులూ, మాకులూ ఫకీరు వద్ద తీసుకుపోతూ వచ్చారు. కాని ఫకీరు నివాసం మసీదు కావటంచేత హిందువులు మాత్రం అటుకేసి రావటం

అజీజ్

మానేశారు. వాళ్ళిప్పుడు ఫకీరు చేత చికిత్సలు కూడా పొందటం లేదు.

ఇది చూసి ఫకీరుకు విచారం కలిగింది. మసీదు కట్టటం పొరపాటయిందని తెలుసుకుని అతను ఒకనాడు పలుగు తీసుకుని, తాను కట్టించిన మసీదును తానే పడగొట్టి, అక్కడ తాను నివసించటానికి కొక గుడిసె వేసుకున్నాడు.

ఇది చూసి ముసల్మానులకు చాలా కోపం వచ్చింది. ఫకీరు మతద్రోహం చేశాడని వాళ్ళు తలపోశారు. వాళ్ళు వచ్చి, ఫకీరు నిర్మించుకున్న గుడిసెను కూలదోసి, సుల్తాను దగ్గిర ఫిర్యాదు చేశారు.

సుల్తాను ఫకీరును పిలిపించి, "నేను మంజూరు చేసిన స్థలంలో మసీదు నిర్మించి, ఆ తరవాత దాన్ని పడగొట్టావుట, నిజమేనా ?" అని అడిగాడు.

నిజమే నన్నాడు ఫకీరు. ఇంత దారుణమైన మతవిద్రోహం చేసినందుకు ఫకీరుకు శిరశ్ఛేద శిక్ష విధించాడు సుల్తాను. సుల్తాను అన్న మాట వింటూనే ఫకీరు రెండు చేతులూ పైకెత్తి విరగబడి నవ్వసాగాడు.

"నీకు మరణదండన విధిస్తే ఏడవటానికి బదులు నవ్వుతున్నావేం ?" అని సుల్తాను ఫకీరు నడిగాడు.

"హుజూర్, నా రెండు చేతుల మధ్య ఉన్న నా తల మసీదు ఆకారాన్ని పోలి ఉన్నది. రాతి మసీదును పడగొట్టినందుకే నా తల తీయిస్తున్నారే, ఈ సజీవమైన మసీదును పడగొట్టినందుకు అల్లా మీ కేమి శిక్ష ఇస్తాడో గదా అని అనుకునేసరికి నాకు నవ్వు వచ్చింది," అన్నాడు ఫకీరు.

సుల్తాను కంగారుపడి, ఫకీరును తక్షణం విడిచిపెట్టాడు. ఫకీరు ఎప్పటిలాగే అందరికీ మందులిస్తూ, సుల్తాను ఇచ్చిన స్థలంలో చిన్న గుడిసె వేసుకుని సుఖంగా కాలక్షేపం చేశాడు.





# రాజైన పేదవాడు

కైరోనగరంలో మహమ్మద్ అనే నిరుపేద యువకు డుండేవాడు. అతని తండ్రి తోలు తిత్తిలో నీరు తెచ్చి ధనికుల దుకాణాల ముందు చల్లి, ఆ విధంగా జీవయాత్ర సాగించాడు. మహమ్మద్ కాస్త పెరిగాక అతను కూడా ఒక చిన్న తోలు తిత్తి తీసుకుని నీళ్ళు చేరవేసే పనిలో తండ్రికి సహాయపడుతూ వచ్చాడు.

కొంతకాల మయాక మహమ్మద్ తండ్రి చనిపోయాడు. మహమ్మద్‌కు తండ్రి నుంచి దక్కిన ఆస్తి రెండు తోలుతిత్తులే.

మహమ్మద్ తన తండ్రిలాగా దృఢశరీరి కాడు. తన తండ్రి చేసిన వృత్తి తనకు సాధ్యం కాదని తెలుసుకుని, అతను పగలు వీధుల వెంట తిరిగి బిచ్చమెత్తి, రాత్రిపూట మసీదు దగ్గిర, తోలుతిత్తులను తలగడగా పెట్టుకుని పడుకుని నిద్రపోతూ ఉండేవాడు. అతను ముష్టెత్తిన డబ్బులు సరిగా తిండికే చాలేవి కావు. అందుచేత అతను ఎలాంటి సుఖాలూ ఎరగడు.

ఇలా ఉండగా మహమ్మద్‌కు ఒకనాడు ఒక ధనికుడు అయిదు వెండి దిరహములు చేతిలో పెట్టాడు; ఏమంటే ఆ రోజు ఆ ధనికుడు పుట్టిన రోజు. ఆ డబ్బుతో మహమ్మద్ గొప్పగా విందు భోజనం చేద్దామనుకుని తిండి దుకాణాలున్న ప్రాంతం కేసి బయలుదేరాడు.

దారిలో అతని కొక మనుషుల గుంపు కనిపించింది. అందరూ నవ్వుతూ అల్లరి చేస్తున్నారు. ఆ గుంపు మధ్య ఒక కోతిని పట్టుకుని ఒక మనిషి నడుస్తున్నాడు. ఆ కోతిని చూడగానే మహమ్మద్‌కు, అది ఉంటే తన జన్మకు ఇంకే వినోదమూ అక్కర్లేదనిపించింది. అందుచేత అతను కోతి గలవాణ్ణి సమీపించి, తన వద్ద ఉన్న అయిదు దిరహములూ పెట్టి ఆ కోతిని కొన్నాడు.

సి. మాధవరావు



కోతిని సంపాదించాక మహమ్మద్‌కు కొత్త సమస్య వచ్చింది. దాన్ని తీసుకుని తాను మసీదు చాయలకు పోవటానికి లేదు. అందుచేత అతను తానెరిగిన ఒక పాడుపడిన ఇంటికి పోయి, రాత్రికి అక్కడే పడుకుందా మనుకున్నాడు. మరొకటి ఆహార సమస్య. మహమ్మద్‌కు ఆ పూట తిండి లేదు. రేపటి నుంచీ అతను తన పొట్ట నింపుకోవటంతో బాటు కోతిని కూడా పోషించాలి.

అయితే ఈ రెండో సమస్య మహమ్మద్ ఊహించని విధంగా తేలిపోయింది. అతను కోతితో బాటు పాడుపడిన ఇంట ప్రవేశించగానే ఆ కోతి తన శరీరాన్ని కంపించటం మొదలుపెట్టి అకస్మికంగా . ఒక యువకుడుగా మారిపోయింది.

ఈ మార్పు చూసి నిర్ఘాంతపోయిన మహమ్మద్‌తో ఆ యువకుడు, "మహమ్మద్, పాపం, నువ్వు నీ దగ్గిర ఉన్న డబ్బంతా పెట్టి నన్ను కొని, నీకు తిండి కూడా లేకుండా చేసుకున్నావు. ఊరికే దిగులుపడకు. ఇదుగో, ఈ బంగారు దీనారం తీసుకుని అంగడికి వెళ్ళి, మనిద్దరికీ మంచి భోజన పదార్థాలు పట్టుకురా," అన్నాడు.

"నేను నిన్నెందుకు కొన్నాను? నువ్వు ఎవరు? ఎక్కణ్ణుంచి వచ్చావు? నీకేం కావాలి?" అని మహమ్మద్ అడిగాడు.

"ఈ ప్రశ్నలన్నీ వేస్తూ కూచోక వేగిరం తిండి పట్టుకురా. నాకు ఆకలి దహించుకుపోతున్నది. ఒక్కటి జ్ఞాపకం ఉంచుకో. నేను నీ అదృష్ట దేవతను. నా వల్ల నీకు ధనమూ, కీర్తీ, హోదా అన్నీ వస్తాయి," అన్నాడా కోతి యువకుడు.

మహమ్మద్ దుకాణాల వద్దకు పరిగెత్తిపోయి ఖరీదైన తినుబండారాలు ఎన్నో తెచ్చాడు. వాటిని ఇద్దరూ తిన్నారు. అది మహమ్మద్ ప్రాణానికి మహత్తరమైనవిందు. కడుపునిండా తిన్నాక ఇద్దరూ పడుకుని నిద్రపోయారు.



మర్నాడు ఉదయం కోతి యువకుడు మహ్మూద్‌తో, "మనకీ పాడుపడిన కొంపలో ఉండే ప్రారబ్ధమేమిటీ? డబ్బిస్తాను, మంచి భవంతిగా చూసి బాడుగకు మాట్లాడిరా," అంటూ బోలెడంత బంగారం ఇచ్చాడు. వాళ్ళు ఉండటానికి గొప్ప భవనమూ, వాళ్ళు ధరించటానికి మేలైన దుస్తులూ ఏర్పాటయాయి. మహ్మూద్ స్నానశాలకు వెళ్ళి వచ్చి కొత్త బట్టలు ధరిస్తే రాజ కుమారుడిలాగా ఉన్నాడు.

"చూడు, మహ్మూద్, నీకు చంద్ర బింబంలాటి రాజకుమార్తె దొరికేటట్టయితే పెళ్ళాడతావా?" అని కోతి యువకుడు అడిగాడు.

"తప్పక పెళ్ళాడతాను," అన్నాడు మహ్మూద్ ధైర్యంగా.

"అయితే ఈ పొట్లం తీసుకుపోయి ఈ నగరపు సుల్తానుకు కానుక ఇచ్చి, ఏమి కావాలని ఆయన అడిగితే, ఆయన కుమార్తె నిచ్చి పెళ్ళి చెయ్యమని అడుగు. ఆ పిల్ల నీకు రాసిపెట్టి ఉన్నది. అందుచేత సుల్తాను నిన్ను తన అల్లుణ్ణి చేసుకోవటానికి ఒప్పుకుంటాడు," అన్నాడు కోతి యువకుడు.

మహ్మూద్ బయలుదేరి రాజభవనానికి వెళ్ళాడు. ద్వారపాలకులు అతని దుస్తులు




చూసి గొప్పవాడనుకుని, అతను సుల్తాను గారికి కానుక సమర్పించుకోవటానికి వచ్చా డని తెలిసి లోపలికి పోనిచ్చారు.

మహ్మూద్ సుల్తానుకు సలాం చేసి తాను తెచ్చిన పొట్లం అందిస్తూ, "ఈ కానుక తమ ఘనతకు తగినది కాదు. నా పేదరికానికి తగినటువంటిది. దయచేసి స్వీకరించండి," అని చెప్పాడు.

సుల్తాను దాన్ని అందుకుని, అక్కడే వున్న ప్రధాన వజీరు కిచ్చాడు. ఆ పొట్లం విప్పి చూస్తే అందులో చక్రవర్తులు ధరించ దగిన రత్నాభరణా లున్నాయి. సుల్తాను వాటిని చూసి నిర్ఘాంతపోయి, "నీ కానుకను





స్వీకరించాం. దీనికి ప్రతిగా ఏం కోరు కుంటావో కోరుకో," అన్నాడు.

"నేను వేరే బహుమానా లేవీ కోరను. తమ కుమార్తెను నా కిచ్చి వివాహం చెయ్యండి," అన్నాడు మహమ్మద్.

సుల్తాను మహమ్మద్ కేసి చాలా సేపు చూసి, తన వజీరు కేసి తిరిగి, "నా కేమీ అభ్యంతరం కనపడలేదు. నీ సలహా ఏమిటి?" అన్నాడు.

వజీరు తల ఊపి, "అమ్మాయిని చేసు కోవటానికి అర్హుడిలాగే కనిపిస్తాడు. అయినా ఒక చిన్న పరీక్ష పెడితే బాగుంటుందని తోస్తున్నది," అన్నాడు.

"ఏం పరీక్ష?" అని సుల్తాను వజీరు నడిగాడు.

"మన వద్ద ఉన్న పెద్ద వజ్రం ఇతనికి చూపించి, అమ్మాయికి కానుకగా అలాటిది మరొకటి తెమ్మందాం," అన్నాడు వజీరు.

మహమ్మద్ సుల్తానుగారి వద్ద ఉండే పెద్ద వజ్రాన్ని చూడగానే హతాశుడై పోయాడు. అది అపురూపమైన వజ్రం. అతను దాన్ని శ్రద్ధగా పరిశీలించి, పైకి తన జంకు తెలియ రాకుండా, "ఇలాటిదే మరొకటి తెచ్చి రేపు తమ దర్శనం చేసు కుంటాను," అని బింకంగా వచ్చేశాడు.

అతను రాగానే కోతి యువకుడు, "నువు వెళ్లినపని ఏమయింది?"అని అడిగాడు.

మహమ్మద్ జరిగినదంతా అతనికి చెప్పాడు. సుల్తాను కోరిన వజ్రం లాంటివి పది ఇస్తానన్నాడు కోతి యువకుడు. అతను అన్నంత పనీ చేశాడు. మర్నాడు ఉదయం మహమ్మద్ పావురాయి గుడ్లంత ప్రమాణం గల మేలు రకం వజ్రాలు పది తీసుకుని సుల్తాను వద్దకు వెళ్లి, "తమరు కోరినటు వంటి వజ్రాలు నా దగ్గిర, ఒకటి కాదు, పది దొరికాయి. అందుచేత పదీ తెచ్చాను. అందులో మీకు నచ్చినవి ఉంచుకుని, మిగతావి పారెయ్యండి," అన్నాడు.



సుల్తాను ఏం చేద్దామన్నట్టు వజీరు కేసి చూశాడు. పెళ్లికి ఒప్పుకోమన్నట్టు వజీరు తల ఊపాడు. సుల్తాను కాజీనీ, సాక్షులనూ పిలిపించి, తన కుమార్తెను మహ్మూద్ కిచ్చి వివాహం చేసినట్టు పత్రం రాయించాడు. మహ్మూద్ ఆ పత్రాన్ని తీసుకుని ఇంటికి వచ్చి కోతి యువకుడికి చూపాడు.

"నేను చెప్పలేదా? నా సహాయంతో నువు సుల్తాను కుమార్తెను పెళ్ళాడావు. కనక నాకొక్క చిన్న ప్రత్యుపకారం చేసి పెట్టాలి," అన్నాడు కోతి యువకుడు.

"ఉపకారమా? నా ప్రాణం అడిగినా ఇస్తాను," అన్నాడు మహ్మూద్.

"నీ భార్య కుడిచేతికి ఒక బాహుబంధం ఉన్నది. ఇవాళ రాత్రి మిమ్మల్నిద్దరినీ గదిలోకి పంపగానే ఆ బాహుబంధం అడిగి తీసుకుని తెచ్చి నాకిచ్చి, ఆ తరవాతనే నువ్వామెతో దాంపత్యం ప్రారంభించాలి. ఆ బాహుబంధం నా చేతిలో ఉంచేదాకా నువ్వామెను తాకనైనా తాకరాదు. ఇదే నా కోరిక," అన్నాడు కోతి యువకుడు.

"నేనడిగితే నా భార్య నిరాకరించ దనుకుంటాను. ఆ బాహుబంధం తెచ్చి నీకిచ్చినదాకా ఆమెను పరస్త్రీగానే చూస్తాను," అని మహ్మూద్ మాట ఇచ్చాడు.



ఆ రాత్రి సుల్తానుకుమార్తె పడకగదిలోకి రాగానే మహ్మూద్, ఆమె కుడి చేతికి ఉన్న బాహుబంధం తనకు కావాలన్నాడు.

"కావలిస్తే తీసుకోండి. అది ఏమంత విలువగలదికాదు. నా చిన్నతనంలో మా దాది కట్టిన తాయత్తు అందులో ఉన్నది," అంటూ సుల్తాను కుమార్తె తన బాహుబంధం విప్పి మహ్మూద్ కిచ్చింది.

"ఇప్పుడే వస్తాను," అంటూ మహ్మూద్ అతి వేగంగా తమ ఇంటికి వెళ్ళి, ఆ బాహుబంధాన్ని కోతి యువకుడి కిచ్చి, వెంటనే రాజసౌధానికి తిరిగి వచ్చాడు. అతను తన పడక గదిలోకి అడుగు పెడు





తూండగానే అతనికేదో మైకం వచ్చినట్టయింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. అతను మూర్ఛపోయాడు. అతనికి తిరిగి స్పృహ తెలిసేసరికి, అతను తన పాత చింకి దుస్తులతో ఆ పాడుపడిన ఇంట్లో కటిక నేలపైన మట్టిలో పడిఉన్నాడు. కోతిగాని, కోతి యువకుడు గాని కనిపించలేదు. సుల్తానూ, సుల్తాను కుమార్తే, తన వివాహమూ, రాజభవనమూ, సమస్తమూ ఒక కలలాగా తోచింది.

మహమ్మాద్ మతిపోయిన వాడిలాగా కైరో నగరవీధుల వెంట తిరగనారంభించాడు. ఒక చోట వీధిపక్కన ఒక జ్యోతిషమాంత్రికుడు చతికిలబడి కూర్చుని ఉన్నాడు. అతని ముందేవో కాగితాలూ, ప్రశ్న పరికరాలూ ఉన్నాయి. ఆ మనిషిని చూడగానే మహమ్మాద్‌కు ప్రాణం లేచివచ్చినట్టయింది. అతనా మాంత్రికుడి కెదురుగా కూర్చుని తన జాతకం చెప్పమన్నాడు.

ఆ మాంత్రికుడు మహమ్మాద్ కేసి చురచురా చూసి, "భార్యను పోగొట్టుకున్న వాడివి నువేనా?" అని అడిగాడు.

"అవును," అన్నాడు మహమ్మాద్ ఆత్రంగా.

"అమాయకుడా, నువు కొన్న కోతి మనిషికూడా కాదు, ఒక దుష్టపిశాచి. వాడు నిన్ను చక్కగా ఉపయోగించుకున్నాడు. ఆ దుర్మార్గుడు సుల్తాను కుమార్తె పైన ఏనాడో కన్నువేశాడు. కాని ఆమె చేతికి తాయెత్తు ఉండటంచేత వాడామెను ఏమీ చెయ్యలేకపోయాడు. ఆ తాయెత్తు కాజెయ్యటానికి వాడు నిన్ను ఉపయోగించి ఆమెను కాజేసుకుపోయాడు. కాని ఆ పిశాచిని నిర్మూలించవచ్చు ననుకుంటాను," అని ఆ మాంత్రికుడు ఒక కాగితం మీద అర్థం లేని గీతలేవో గీసి మహమ్మాద్ చేతికిస్తూ, "ఈ కాగితం పట్టుకుని నేను చెప్పే స్థలానికి వెళ్ళు. అటుగా ఒక తండా వస్తుంది.

ఆ తండాకు నాయకుడైనవాణ్ణి గుర్తించి, అతనికి ఈ కాగితం ఇయ్యి, నాకిప్పుడు నువ్వేమీ ఇవ్వనక్కర్లేదు. నీపని సానుకూల మైన తరవాత ఇద్దువుగాని," అన్నాడు.

మాంత్రికుడు చెప్పిన చోటికి దారీ, గుర్తులూ తెలుసుకుని ఆ రాత్రికి మహ్మూద్ అక్కడికి చేరుకున్నాడు. అదొక ఎడారి ప్రదేశం. ఎక్కడ చూసినా గడ్డి ఎత్తుగా పెరిగి ఉన్నది. అతను ఒక చోట కూర్చుని ఆలకించాడు. అంతటా పక్షులు పరిగెడు తున్నట్టు ధ్వనులు వినిపించాయి, కాని కంటికేమీ కనిపించలేదు. అంతకంతకూ అతనికి భయం ముంచుకొస్తున్నది.

ఇంతలో దూరంగా కాగడాలు కనిపిం చాయి. పట్టుకున్నవాళ్ళు కనిపించలేదు. అసంఖ్యాకమైన కాగడాలు గాలిలో తేలి వస్తున్నట్టున్నది. కొంచెం దగ్గిరికి వచ్చాక ఆ కాగడాల నడిమధ్యను ఒక సింహాసనం మీద కూర్చుని ఒక వ్యక్తి కనిపించాడు. ఆ వ్యక్తి తన కేసే చూస్తూండటం గమనించి, మహ్మూద్ ఆయనకు కాగితం అందించాడు.

ఆయన కాగితం చదివిచూసుకుని, కాగ డాలను ఆపి, ఎవరినో అదృశ్యవ్యక్తిని పిలిచి, "అత్రాష్, నువు కైరోకి వెళ్ళి ఫలాని పిశాచిని గొలుసులతో బంధించి పట్టుకురా!" అని ఆజ్ఞాపించాడు.



ఒక గంట లోపల కోతి యువకుడు గొలుసులతో బంధించబడి అక్కడ ప్రత్యక్షమయాడు. అదృశ్య వ్యక్తుల నాయకుడు అతన్ని, "ఈ మనిషి నోటి ముందరి ముద్ద ఎందుకు కాజేసి, కబళించావు?" అని అడిగాడు.

"ఆ ముద్దను నే నింకా కబళించలేదు. అది నా కోసం తయారుచేసుకున్న ముద్దే!" అన్నాడు కోతి యువకుడు.

"అతని బాహుబంధం వెంటనే అతనికి ఇచ్చెయ్యి," అన్నాడు నాయకుడు.

"దాన్ని నా దగ్గిర నుంచి ఎవరూ తీసుకోలేరు," అంటూ కోతి యువకుడు తన నోరు తెరిచి బాహుబంధాన్ని మింగేశాడు.

మరుక్షణమే నాయకుడు అతని నెత్తిన చెయ్యి పెట్టి అణగ నొక్కాడు. కోతి యువకుడు అణగారిపోయి, చివరకు కాయపగిలి నట్టు పగిలిపోయాడు. తరవాత నాయకుడి ఆజ్ఞ ప్రకారం ఒక అదృశ్య వ్యక్తి కోతి యువకుడి శిథిలాలలో నుంచి బాహుబంధాన్ని తీసి మహమ్మద్ చేతిలో పెట్టాడు.

మహమ్మద్ ఆ బాహుబంధాన్ని చేత పట్టుకున్న మరు క్షణం దృశ్యం మారిపోయింది. స్పృహ పోక పూర్వంలాగే అతను సుల్తాను గారి భవనంలో పడక గదిలో ఉన్నాడు. సుల్తాను కుమార్తె శయ్యమీద పడుకుని నిద్రపోతున్నది. అతను ఆమె చేతికి బాహుబంధం కట్టగానే ఆమె లేచి కూర్చున్నది.

ఈసారి అతనికి మరొక కల నుంచి మేలుకున్నట్టుగా ఉన్నది. మర్నాడు అతన్ని గాని, అతని భార్యను గాని ఎవరు కూడా, "మీ రీ రెండు రోజులూ ఏమయారు?" అని అడగలేదు.

ఇక మహమ్మద్‌కు ఎలాటి చిక్కులూ ఏర్పడలేదు. అతను సుల్తాను కుమార్తెతో సుఖంగా కాపరం చేస్తూ, సుల్తానుకు వేరే మగపిల్లలు లేనందున, ఆయన అనంతరం తానే కైరోకు సుల్తానయాడు.






# కాలుడి తపస్సు

కాలు డనే ఒక బ్రాహ్మణుడు పుష్కర తీర్థానికి వెళ్లి అక్కడ రెండువందల ఏళ్ళ పాటు అహోరాత్రాలు తపస్సు చేశాడు. ఆయన తల నుంచి కోటిసూర్యులతో సమానమైన తేజస్సు వెలువడింది. అప్పుడు బ్రహ్మ, ఇంద్రుడూ వచ్చి, "నీ తపస్సుతో ఎందుకిలా లోకాలన్నీ దగ్ధం చేస్తావు? నీకేం వరం కావాలో కోరుకో," అన్నారు.

"తపస్సు మీద తప్ప మరి దేనిమీదికీ నా మనస్సు పోరాదన్నదే నేను కోరే వరం," అన్నాడు కాలుడు.

"అలా కాదు, మేం నీకు ఏదో ఒక వరం ఇస్తాం కోరుకో," అని వాళ్ళు వేధించుకు తినేసరికి, కాలుడు పుష్కర తీర్థాన్ని విడిచిపెట్టి, హిమాలయాల ఉత్తర పార్శ్వానికి వెళ్లి, అక్కడ మళ్లీ తపస్సే సాగించాడు.

అప్పుడు దేవతలు కాలుడి వద్దకు యముణ్ణి పంపారు. యముడు వచ్చి కాలుడితో, "బ్రాహ్మడా, మనుషు లింతకాలం జీవించరు. లోక మర్యాద ప్రకారం నీ ప్రాణాలు వదిలెయ్యి," అని అడిగాడు.

"నా ఆయువు పూర్తి అయితే నన్నెందుకు తీసుకుపోవు? నా ప్రాణాలను నేనే వదిలి ఆత్మహత్య చేసుకోమంటావురా?" అన్నాడు కాలుడు.

కాలుడి ప్రాణాలు తీసే శక్తి లేక యముడు తన పాశాన్ని భుజాన వేసుకుని వచ్చిన దారి పట్టాడు.

ఇంద్రుడు, ఏం చెయ్యటానికీ పాలుపోక, కాలుణ్ణి అమాంతంగా ఎత్తి తీసుకుపోయి స్వర్గంలో పెట్టాడు. స్వర్గసుఖాలు కళ్ళారా చూసి కాలుడి బుద్ధి మారుతుందని ఇంద్రుడి ఆశ. కాని ఆ ఆశ ఫలించలేదు. స్వర్గంలో కూర్చుని కూడా కాలుడు తపస్సే చేశాడు.

తరవాత ఇంద్రు డాయన పక్కన చేరి, "ఏదన్నా వరం కోరుకో," అని మంచిగా

టి. అప్పలాచార్యులు

సలహా ఇవ్వసాగాడు. ఆ సమయంలో ఇక్ష్వాకు అటుగా వచ్చి, సంగతి తెలుసుకుని, "అయ్యా, నీకు దేవతల నుంచి వరం పొందటం ఇష్టం లేకపోతే నన్ను వరం కోరు, ఇస్తాను," అన్నాడు.

"దేవతల వరాలనే నిరాకరించే వాడికి వరమిచ్చేటంత సమర్థుడివా?" అని కాలుడు ఇక్ష్వాకు నడిగాడు.

"నిజమే, నేను సమర్థుణ్ణికాను, నువు సమర్థుడివి. అందుచేత నువే నాకు వరమియ్యి," అన్నాడు ఇక్ష్వాకు.

"అయితే నీకేం కావాలో కోరుకో," అన్నాడు కాలుడు.

తాను బ్రాహ్మణుడికి దానం ఇవ్వదగిన క్షత్రియుడై ఉండి, బ్రాహ్మణుడినుంచి దానం ఎలాగ్రహించటమా అని ఇక్ష్వాకు తటపటాయించాడు.

ఇద్దరు బ్రాహ్మణులు వివాదపడుతూ వచ్చి రాజును తీర్పు చెప్పమన్నారు.

"రాజా, నేనీ బ్రాహ్మడి నుంచి దక్షిణతో సహా ఆవును దానం పట్టాను. ఆ ఆవునే నానుంచి దానంగా పుచ్చుకోమంటే ఈ బ్రాహ్మడు పుచ్చుకోనంటున్నాడు. ఇదేం న్యాయం?" అన్నాడు మొదటి బ్రాహ్మడు.

"నేనెప్పుడూ దానం పట్టినవాణ్ణి కాను. నాకా ఆవు అవసరంలేదు. తీసుకోమని బలవంతం చేస్తాడు. ఇదేం న్యాయం?" అన్నాడు రెండో బ్రాహ్మడు.

రెండో బ్రాహ్మడిదే న్యాయమని ఇక్ష్వాకు తీర్పు చెప్పాడు. వెంటనే ఇంద్రుడు ఇక్ష్వాకుతో, "ఈ బ్రాహ్మణుణ్ణి వరం అడిగి, ఆయన ఇస్తానంటే నీవు తీసుకోకుండా ఉన్నావు. అదేం న్యాయం?" అన్నాడు.

ఇక్ష్వాకు ఆ మాటకు జవాబు చెప్పలేక కాలుడితో, "స్వామీ, నీ తపఃఫలంలో సగం నాకియ్యి," అని కోరాడు. సరేనన్నాడు కాలుడు. అలా పొందిన తపశ్శక్తితో ఇక్ష్వాకు అన్నిలోకాలకూ సంచారం చెయ్యగలిగాడు.





# దేవుడికి పరీక్ష

ఒక ఊళ్ళో ఒక గొప్ప భక్తుడుండేవాడు. ఆయన ఊరూరూ తిరిగి ప్రజలకు దేవుడి మహిమలను గురించి బోధ చేస్తూ ఉండే వాడు. ఒకరోజు ఆ భక్తుడు రామన్న పాలెం అనే గ్రామంలో ఈ విధంగా ఉప న్యాసం చేశాడు :

దేవుడు తాను పుట్టించే ప్రతి ప్రాణికీ ఆహారం సిద్ధంగా ఉంచుతాడు. అప్పుడు పుట్టిన బిడ్డకు సైతం తల్లిపాలు సిద్ధంగా ఉంటాయి. చీమలాటి సూక్ష్మ ప్రాణికి కూడా దేవుడు తిండి అందిస్తాడు. ఏ ఒక్క జీవినీ తిండిలేక చావనివ్వడు; ప్రతి ప్రాణినీ ఏదోవిధంగా తిండి తినిపిస్తాడు. ఎవరన్నా తిననని మూర్ఖిస్తే తన్ని మరీ తినిపిస్తాడు. సందేహంలేదు.

ఈ విధంగా భక్తుడు ఉపన్యాసం చేస్తూ ఉంటే జనం ఆనందంగా వింటున్నారు. వారిలో సుబ్బయ్య అనే వాడికి మాత్రం ఈ ఉపన్యాసం నచ్చలేదు. అతను జనం మధ్య లేచి నిలబడి భక్తుడితో, "స్వామీ, మీరు చెప్పేది మరీ విడ్డూరంగా ఉన్నది. తిననని భీష్మించుకు కూర్చున్నవాణ్ణి దేవుడు ఎలా తినిపించగలడు?" అన్నాడు.

"దేవుడికి అదెంతపాటిపని, నాయనా?" అన్నాడు భక్తుడు.

సుబ్బయ్య చాలా మొండివాడు. అతను ఆరోజు నుంచీ తిండి తినకుండా ఉండ టానికి నిశ్చయించాడు; దేవుడు తన చేత ఎలా తినిపిస్తాడో చూతామనుకున్నాడు.

అతను ఇంటికి వెళ్ళగానే, భార్య అతన్ని భోజనానికి రమ్మన్నది.

"నాకు ఆకలి లేదు. నేను భోజనం చెయ్యను," అన్నాడు సుబ్బయ్య.

"మీ కిష్టమని కాకరకాయ వేపుడు చేశాను. అంత ఆకలి లేకపోతే కొంచెం తినండి," అన్నది భార్య.

ఎం. ముంతాజ్ బేగం

"తిననంటూంటే నీకుకాదూ?" అని సుబ్బయ్య భార్య పైన ఎగిరిపడ్డాడు.

పిల్లలు అన్నాలు తింటూ తాము తినేది సుబ్బయ్యనోట బలవంతాన పెట్టబోయారు. ఇంటి దగ్గిర ఉంటే తన దీక్ష సాగదనుకుని, సుబ్బయ్య ఇంటి నుంచి బయలుదేరి, ఊరి పొలిమేర వద్దకు చేరి, అక్కడ ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

ఆ ఊళ్ళోనే ఒక ఇంటివారి కోడలికి దయ్యం పట్టింది. భూతవైద్యుడు వచ్చి, మంత్రాలు చదివి, కుంభం దిగదుడుపుతీసి, దాన్ని ఊరి పొలిమేర దగ్గిర వున్న మర్రి చెట్టు కింద పెట్టించమని చెప్పాడు. ఇంటి వాళ్ళ నౌకర్లు ఆ వంటకా లన్నింటినీ తెచ్చి, సుబ్బయ్య కూర్చున్న చోటికి కొంచెం ఎడంగావున్న ఒక మర్రిచెట్టు కింద పెట్టి వెళ్ళిపోయారు.

సుబ్బయ్యకు ఆకలి దహించుకుపోతున్నది. వంటకాల వాసనకొట్టి అతనికి నోరూరుతున్నది. అయినా దేవుణ్ణి పరీక్షించటం కోసం అతను తన మనసును నిగ్రహించుకుని అలాగే కూర్చున్నాడు.

రాత్రి చాలా పొద్దుపోయింది. అర్ధరాత్రి గడిచాక మూడో ఝాములో కొందరు దొంగలు, తాము పక్క గ్రామాల్లో దొంగిలించిన సొత్తు పంచుకోవటానికి అక్కడికే



వచ్చారు. మంచి వంటకాల వాసన వాళ్ళకు కూడా తగిలింది.

"ఇక్కడ ఈ పిండివంటలూ భోజనమూ ఎలా వచ్చాయి?" అని కొందరు దొంగలు అన్నారు.

"ఎలా వస్తేనేం? కడుపు నిండా తినేద్దాం. ఏమిటా చచ్చు సందేహాలు?" అన్నారు మరికొందరు.

"తొందరపడకండి. మనని చంపి మన డబ్బు కాజెయ్యటానికి ఎవరైనా దుర్మార్గులు విషం కలిపిన ఆహారం ఇక్కడ పెట్టి ఉండవచ్చు. అలా చేసినవాళ్ళు దగ్గిరలోనే ఉంటారు. వెతకండి," అన్నారు ఇంకొందరు దొంగలు.

వాళ్ళు త్వరలోనే, అంత దూరంలో చెట్టు కింద నిశ్చలంగా కూర్చుని ఉన్న సుబ్బయ్యను చూశారు.

దొంగలంతా బిలబిల మంటూ పోయి సుబ్బయ్యను చుట్టుముట్టి, "ముచ్చు వెధవా! మమ్మల్ని చంపి మా డబ్బు కాజెయ్యటానికి ఇక్కడ చీకట్లో మాటువేసి కూర్చున్నావా? నువే తిను నీ విషపు తిండి!" అన్నారు.

"నాకేమీ తెలీదు. నేను తినను!" అన్నాడు సుబ్బయ్య.

సుబ్బయ్య తిననంటే తినననీ మొండికెత్తటం చూసి దొంగల అనుమానం మరింత దృఢపడింది.

వాళ్ళు సుబ్బయ్యను చావగొట్టి, బలవంతాన ఆ వంటకాలు అతని నోట గుక్కారు. వాటిని సుబ్బయ్య తిన్నాడు. సుబ్బయ్య చావకపోవటం చూసి దొంగలు అతనికి పెట్టటం మానేసి, కుంభం అంతా తామే తినేసి తమ పని ముగించుకుని వెళ్ళిపోయారు.

దేవుడే నెగ్గాడు గదా అనుకుని సుబ్బయ్య ఆ చీకట్లో పడి తిన్నగా ఇల్లు చేరుకున్నాడు.






# టెంకాయదొంగ

ఒక గ్రామంలో పెదరామయ్య అనే భూస్వామి సిద్ధిగాడనేవాణ్ణి నాలుగు రూపాయల నెల జీతంమీద తోటమాలిగా పెట్టుకుని, వాడి చేత తోట వేయించాడు. అందులో అరటి చెట్లూ, మామిడి చెట్లూ, కొన్ని కొబ్బరి చెట్లూ నాటారు. కూరగాయలు కూడా వేశారు.

కాలక్రమాన తోట పెరిగి వచ్చింది. తన జీతం కాస్త పెంచమని సిద్ధిగాడు భూస్వామిని అడిగాడు.

"అప్పుడేనా? అంత తొందరపడకు. కొబ్బరిచెట్లు కాపుకు రానీ, చూద్దాం," అన్నాడు పెదరామయ్య.

కొబ్బరి చెట్లకు కూడా గెలలుపడ్డాయి. తన జీతం మరి రెండు రూపాయలైనా పెంచి తీరాలని సిద్ధిగాడు పట్టుబట్టాడు.

"పోరాపో! ఇప్పుడు నీకు తోట పని ఏమంత ఉన్నదని? నీ జీతం ఒక్క దమ్మిడీ కూడా పెంచను. ఇష్టముంటే ఉండు, లేకపోతే పని మానేసి వెళ్ళిపో," అన్నాడు యజమాని.

సిద్ధిగాడు చిక్కులో పడ్డాడు. వాడు తోటకు చెయ్యవలిసిందంతా అదివరకే చేశాడు. ఇక చెయ్యవలిసిన కష్టమైన పని ఏదీలేదు. ఆ సంగతి తెలిసే యజమాని అంత ధీమాగా ఉన్నాడు. ఇంతకాలమూ ఒళ్ళు దాచుకోకుండా, న్యాయంగా పని చేసిన సిద్ధిగాడు ఇకనుంచీ దొంగతనానికి ధిగధలిచాడు.

వాడు ప్రతి రాత్రీ తోట నుంచి రెండేసి టెంకాయలు ధొంగతనం చేస్తూ వచ్చాడు. మూడు రోజులు గడిచేసరికల్లా పెదరామయ్యకు కొబ్బరికాయలు పోతున్నట్టు ఆచూకీ తెలిసింది, కాని దొంగ ఎవరో తెలియలేదు. ఆయన సిద్ధిగాణ్ణే అడిగి చూశాడు. కొబ్బరి కాయలు పోతున్నాయని

ఎస్. ఆనందవర్మ

గాని, దొంగ ఫలానా అని గాని తనకు తెలియదన్నాడు సిద్ధిగాడు.

"సరే, రాత్రిపూట తోటలో కాపలా ఉండి, దొంగను పట్టుకో," అన్నాడు యజమాని.

"రెండు రూపాయలు జీతం పెంచండి, అలాగే రాత్రింబవళ్ళు కూడా కాపలా వుండి దొంగను పట్టుకుని మీకు ఒప్పజెబుతాను," అన్నాడు సిద్ధిగాడు.

"అదేమీ కుదరదు. నేనే కాపలా ఉంటాలే," అని పెదరామయ్య అప్పటికప్పుడే గ్రామదేవత గుడికి వెళ్ళి, "తల్లీ, టెంకాయ దొంగను ఈ రాత్రి నా కంట పడేస్తివా రేపు నీ కొక మేక నిస్తాను," అని దణ్ణం పెట్టుకున్నాడు.

తాను కూడా దేవతకు దణ్ణం పెట్టుకోవటానికి వచ్చిన సిద్ధిగాడు చాటున వుండి ఈ మాట విన్నాడు.

యజమాని వెళ్ళిపోయాక సిద్ధిగాడు దేవతతో, "తల్లీ, నన్ను యజమాని చేతికి చిక్కకుండా తప్పించావంటే రేపు నీ కొక పుంజు నిస్తా. అంతకు మించి నా శక్తి లేదు," అని దణ్ణం పెట్టుకున్నాడు.

ఆ నాడు అర్ధరాత్రి వేళ సిద్ధిగాడు తోటలో ప్రవేశించి, బావి పక్కన ఉన్న కొబ్బరి చెట్టెక్కి, ఒక కాయ కోసి దూరంగా విసిరి



వేశాడు. యజమాని తోటలో పొంచి ఉన్న పక్షంలో, కాయ పడిన చోటనే దొంగ కోసం చూస్తాడని వా డలా చేశాడు.

కాని పెదరామయ్య అంతకు ముందే, బావి పక్క నున్న చెట్టు మీదికి ఎవరో ఎక్కటం కనిపెట్టి, కర్రా తాడూ తీసుకుని ఆ చెట్టు కిందికే వచ్చి, "ఎవర్రా చెట్టు మీద? దొంగ వెధవా! నన్నే మోసం చేద్దామనుకున్నావా? కిందికి దిగి రారా! నిన్ను చెట్టుకు కట్టి చర్మం వొలిచేస్తాను!" అని గద్దించాడు.

సిద్ధిగాడు భయంతో వణికిపోతూ చెట్టు మీదనే కదలకుండా ఉండిపోయాడు. అంతలోనే ఎవరో మనిషి ఆ చెట్టు మీది నుంచే బావిలోకి గభీమని దూకటం పెదరామయ్య కంట పడింది. వెంటనే అతను బావిలోకి దూకి దొంగ కోసం వెతకసాగాడు. ఎవరిదో తల అతని చేతికి తగిలింది గాని, పట్టు చిక్కలేదు.

కొంతసేపయాక ఆ బావిలో దూకిన వ్యక్తి రామయ్యను ఒక్క తన్ను తన్ని, చివాలున బావిలో నుంచి పైకెగిరి, తప్పించుకు పోయాడు. దొంగ లాఘవం చూస్తే అతనికి ఆశ్చర్యమయింది.

మర్నాడు పెదరామయ్య గ్రామదేవత గుడికి వెళ్ళి, "తల్లీ, నన్ను మోసగించావు. దొంగ తప్పించుకు పోయాడు. నేను నీకు మేక నివ్వను," అన్నాడు.

"దొంగను కళ్ళ చూపమన్నావు, చూపాను. నీ పనివాడికి రెండు రూపాయలు జీతం పెంచలేని పిసినిగొట్టువు నాకు మేక నిస్తావా? సిద్ధిగాడి జీతం పెంచితే నీకీ కష్టాలే రాకపోను గద!" అన్నది దేవత పూజారికి పూని.

పెదరామయ్యకు జ్ఞానోదయ మయింది. ఆయన ఆ రోజే సిద్ధిగాడికి జీతం పెంచాడు. తరవాత తోటలో టెంకాయ దొంగతనాలు జరగలేదు.





# కృష్ణావతారం

ఆ రాత్రి అక్రూరుడు బలరామకృష్ణులతో సహా సుఖమైన భోజనం చేసి, ఒకచోటనే అందరూ పడుకున్నప్పుడు, "నాయనా, తల్లిగర్భం నుంచి బయటపడుతూనే ఇలాటి హీనజీవితంపాలై, ఎన్నో ఘనకార్యాలు చేశావు. ఇంక ఈ జీవితం చాలు. నీ అసలు వంశానికి కీర్తిప్రతిష్ఠలు చేకూర్చు. నీ తండ్రి వసుదేవు డెంతో గొప్పవాడు. మీ ఇద్దరిలాటి కొడుకులుండి కూడా, కంసుడికి భయపడుతూ, ఆ దుర్మార్గుడి చేత అవమానాలుపడుతూ, కొడుకులను అడవుల పాలు చేశానే అని మహాకుమిలి పోతున్నాడు. కంసుడు మీ తండ్రిని అనరాని మాటలంటూంటే, మేమందరమూ చేసేదిలేక, తలలు వంచుకుని, కంట తడిపెడతాం. ఇక మీ తల్లి దేవకీదేవి దుఃఖం చెప్పటానికే లేదు. వరసగా ఆమె గర్భాన పుట్టిన బిడ్డలందరినీ కంసుడు చంపేశాడు. అంత మంది పిల్లలను కని కూడా ఆ ఇల్లాలు ఒక్క బిడ్డకు పాలిచ్చి ఎరగదు. ఇంత చక్కనివాడివి, నీ ముఖం ఎలా ఉంటుందో ఆ తల్లికి తెలుసునా? ఆవిడ మాతృత్వం సఫలం చేసే భారం నీపైన ఉన్నది. నీవంటి కొడుకును పెట్టుకుని ఆవిడ అహర్నిశలు దుఃఖంలో మునిగి తేలుతున్నదంటే, ఇంతకంటె గొడ్రాలితనమే మేలు గదా?" అంటూ అక్రూరుడు కృష్ణుడికి హితోపదేశం చేశాడు.

అయన మాటల సారాంశం కృష్ణుడికి అర్థమయింది. అతను మధురానగరానికి

10. బలరామకృష్ణుల మధురాగమనం




వెళ్ళి, కంసుణ్ణి చంపి, తన తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులకు ఆనందం చేకూర్చాలి.

తెల్లవారింది. అక్రూరుడూ, బలరామకృష్ణులూ కాలకృత్యాలు తీర్చుకుని రథం ఎక్కారు. అక్రూరుడు రథం తోలుతూ వ్రేపల్లె దాటి, మధురకు వెళ్ళే దారిపట్టాడు. కొందరు గోపికలు రథాన్ని కొంతదూరం వెంబడించారు. కృష్ణుడు వెళ్ళిపోవటం వాళ్ళకేమీ బాగాలేదు. కొందరు అక్రూరుణ్ణి బాగా తిట్టుకున్నారు. మరికొందరు, "రేపు ఏ రాక్షసుడన్నా మనమీద వచ్చిపడితే ఎవరు కాపాడతారు? కృష్ణుణ్ణి వెళ్ళిపోని



స్తున్న మనవాళ్ళు వెర్రివాళ్ళుకారా?" అని అడిగారు. వాళ్ళు కొంతదూరం రథాన్ని వెంబడించి, అతివేగంగా వెళ్ళే రథాన్ని అనుసరించలేక ఆగి, రథం లేపే దుమ్ము కనబడకుండా పోయేదాకా చూసి, తిరిగి వెళ్ళిపోయారు.

మధ్యాన్నందాకా నడిచి రథం కాళిందీ తీరాన ఒక కదంబవృక్షం నీడలో ఆగింది. అక్రూరుడు బలరామకృష్ణులతో, "నేను నదిలో స్నానంచేసి, అర్ఘ్యం విడిచి, ఇప్పుడే వస్తాను. అంతదాకా మీరు రథంలోనే ఉండండి. ఈలోపుగా గుర్రాలు గరిక మేస్తాయి," అని చెప్పి, నదిలోకి దిగి, నడుములోతు నీటిలో మునిగాడు.

అలా మునిగిన అక్రూరుడికి నీటిలో రసాతలం కనబడింది. అక్కడ వాసుకీ, కర్కోటకుడూ మొదలైన నాగశ్రేష్ఠులు తిరుగుతున్నారు. చాలా అందంగా నిర్మించిన రత్నమండపం లోపల వెయ్యి తలల ఆదిశేషుడు కనిపించాడు. అతని శరీరం స్వచ్ఛంగానూ, తెల్లగానూ, చుట్టలు చుట్టుకుని ఉన్నది. పడగలు ఎత్తి ఉన్నాయి. అతని నాలుకల వరస మెరుపుతీగలాగా చలిస్తున్నది. అతని పార్శ్వాల రోకలీ, నాగలీ, తాటిచెట్టూ గుర్తులు గల జెండా





లున్నాయి. ఆ శేషుడి చుట్టలపైన కృష్ణుడు, నల్లగా, తామరకన్నులతోనూ, పసుపు పచ్చని బట్టతోనూ కూర్చుని కనిపించాడు.

అలా కనిపించిన కృష్ణుణ్ణి అక్రూరుడు మంత్రాలతో ఆరాధించి, మానసికంగానే వివిధ అర్చనాసామగ్రితో అర్చించాడు. తరవాత అతను నీటిలో నుంచి పైకి లేచి చూసేసరికి, రథం మీదనున్న బలరామ కృష్ణుల దేహాలపైన తన అర్చన తాలూకు గుర్తులు కనిపించాయి. అక్రూరు డది చూసి మరింత అద్భుతపడి, మళ్ళీ నీటిలో మునిగి, తిరిగి ఆదిశేషుణ్ణీ, అతని పైన కూర్చుని ఉన్న కృష్ణుణ్ణీ చూశాడు.

చివరకు అక్రూరుడు తన అనుష్ఠానాలు ముగించుకుని రథాన్ని చేరరాగానే కృష్ణుడు, "అక్రూరుడా, చాలా ఆలస్యం చేశావు. పాతాళంలో ఏదో చోద్యం కనిపించినట్టున్నదే? నీ ముఖాన ఆశ్చర్యం చూస్తే అలాగే ఉన్నది," అన్నాడు.

"దేవా, నువు దగ్గరలో ఉండటం కన్న పెద్ద చోద్యం ఇంకేం కావాలి? నువూ, నీ అన్నా ఇక్కడ కనిపించినట్టే నీటిలో కూడా కనిపించారు. నీ వాస్తవరూపం వర్ణించటం బ్రహ్మకైనా సాధ్యంకాదే, నేనేపాటివాణ్ణి? నా పైన వాత్సల్యం ఉంచి అనుగ్రహించు. మనం ఇంక బయలు దేరాలి. కంసుడు మీ కోసం ఆత్రంగా ఎదురుచూస్తూ ఉంటాడు. సూర్యాస్తమయం లోపల మనం నగరం చేరాలి," అన్నాడు అక్రూరుడు.

కృష్ణుడు నవ్వి, "నీ చేతిలో ఉన్నాం, మా చేతిలో ఏమీలేదు," అన్నాడు.

రథం తిరిగి బయలుదేరి సాయంకాలం వేళకు మధురానగరం చేరింది. కృష్ణుడు అక్రూరుడితో, "నగరం అనేది ఎట్లా ఉంటుందో ఎన్నడూ చూసినవాళ్ళంకాము. కంసమహారాజును చూసినదాకా ప్రాణాలాగేటట్టులేవు, అందుచేత ముందుగానే

నాలుగు వీధులూ చుట్టివస్తాం, అనుమతించు," అన్నాడు.

అక్రూరుడు వాళ్ళను రథం దించి, "మీకు వసుదేవుడి ఇంటికి వెళ్ళాలనిపించవచ్చు. కాని ఆ పని చెయ్యకండి. ముందు తనకు కనపడకుండా వసుదేవుణ్ణి చూస్తే కంసుడికి కోపం వస్తుంది," అని చెప్పి, బలరామకృష్ణులను తీసుకొచ్చానని కంసుడితో చెప్పటానికి వేగంగా రథం తోలుకుంటూ వెళ్ళిపోయాడు.

కట్టుతాళ్ళు విప్పిన ఏనుగుల జంటలాగా బలరామకృష్ణులు మధురానగరపు రాజవీధి వెంబడి, నగరపు వింతలను ఆశ్చర్యంగా చూసుకుంటూ, ముందుకు నడవసాగారు. వారలా నడుస్తుంటే అక్కడి పౌరులు వారిని చూసి రకరకాలుగా మాట్లాడుకున్నారు.

కొంతదూరం వెళ్ళేసరికి బలరామకృష్ణులకు రంగకారుడనే చాకలి కనిపించాడు. అతను రకరకాలబట్టలు మడతలుపెట్టి మూటగట్టి తీసుకుపోతున్నాడు.

"ఏమోయ్, చాకలీ? మేం రాజుగారిని చూడబోతున్నాం. రాజసభకు వెళ్ళేవాళ్ళు మంచిమంచి బట్టలు కట్టుకుని మరీ వెళ్ళాలి గద. అందుచేత నీ దగ్గిర ఉన్న



బట్టల్లో మంచివి చూసి మా కియ్యి, మంచివాడివి!" అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు చాకలి చాలా కోపించి, "అడవుల్లో పశువుల మధ్య తిరిగే అనాగరికపు మొహాలకు కంసమహారాజు కట్టే బట్టలు కావలిసివచ్చాయా? ఈ బట్టలంటే ఏమిటనుకున్నారు? ఎక్కడెక్కడి రాజులో కంసమహారాజుకు కానుకగా పంపినవి. పిచ్చిపిచ్చిగా మాట్లాడక, పదండి," అన్నాడు.

కృష్ణుడికి కోపం వచ్చింది. అతను కత్తి పెట్టి చాకలి మెడ మీద ఒక్కటి పెట్టాడు. తల తెగి కిందపడి చాకలి కాస్తా చచ్చాడు. వాడి కెందరో భార్యలున్నారు. వాళ్ళు పరి



"మేము దేశాంతరం నుంచి వచ్చిన మల్లులం. మీ రాజుగారినీ, రాజ్యాన్నీ, విల్లుకు జరగబోతున్న గొప్ప ఉత్సవాన్నీ చూసి సంతోషింతామని వచ్చాం. నీ గొప్ప నువు చెప్పుకున్నావనుకో. మేము ఊరికే నిన్ను ఎలా మెచ్చుకోం? ఆ పాత్రలో ఉన్న గంధం ఇచ్చావంటే, మేము పూసుకుని, నిన్ను మెచ్చుకుని వెళ్ళి రాజుగారి దర్బారులో కాస్త కళగా కూర్చుంటాం," అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు కుబ్జ నవ్వి, "సరే తీసుకోండి," అంటూ తన పాత్రలోని గంధం ఇచ్చేసింది. కృష్ణుడు ఆ గంధాన్ని ముందు బలరాముడి కిచ్చి, తనకు కావలిసినది తాను కూడా పూసుకుని, మిగిలినది అక్కడ ఉన్న పిల్లల కిచ్చేశాడు. అతనికి ఆ కుబ్జను మామూలు మనిషి చెయ్యాలనిపించింది. అందుకని అతను, ఆ కుబ్జ కాలివేళ్ళను తన కాలివేళ్ళతో నొక్కిపట్టి, చూపుడు వేలుతో ఆమె ముఖం పైకెత్తాడు. వెంటనే ఆమె రూపు మారిపోయి, ఆమె శరీరం వంకలు తీరింది. సన్నని నడుమూ, చదునైన వీపూ, దీర్ఘమైన దేహమూ ఏర్పడ్డాయి. ఆమె తనను తాను చూసుకుని అద్భుతమూ, ఆనందమూ పొంది,




నవ్వుతూ కృష్ణుణ్ణి చూసి, "నా కెంతో మహోపకారం చేసిన మహానుభావుడవు, మా యింటికి వచ్చి నన్ను ధన్యురాలిని చెయ్యి. నీ దారిన నువు పోతానంటే ఊరుకోను," అన్నది, అతని చేతిని తన చేత్తో పట్టుకుని.

"నా కిప్పుడు బోలెడంత పని ఉన్నది. మళ్ళీ వస్తాను. నువు నా దానివే ననుకో," అంటూ కృష్ణుడు మంచిగా ఆమె చెయ్యి విడిపించుకుని, బలరాముడితో సహా ముందుకు సాగాడు. వాళ్ళిద్దరూ తమ ఉద్దేశాలనూ, బింకాన్నీ పైకి కనబడనీయక, మామూలు గొల్లవాళ్ళలాగానే ప్రవ



ర్రించుతూ, నెమ్మదిగా నడుచుకుంటూ కంసుడి మందిరద్వారాన్ని చేరుకున్నారు. అక్కడ చాలా కోలాహలంగా ఉన్నది. కంసుడికి ఎందరెందరో రాజులు పంపిన కానుకలు, ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, సుందర వస్తువులూ వేల సంఖ్యలో ఎడతెగకుండా వచ్చి చేరుతున్నాయి.

లోపల ఆయుధాగారం ఉన్నది. దాన్ని బంగారంతోనూ, పెద్దపెద్ద మణులతోనూ చాలా అందంగా నిర్మించారు. అనేకమంది రాజులు దాన్ని చూడవచ్చారు. అసంఖ్యాకులైన భటులు దానికి రక్షగా ఉన్నారు.

"కంసమహారాజుగారి విల్లు ఇక్కడేనా ఉండేది? దాన్ని చూద్దామని చాలా దూరం నుంచి వచ్చాం. ఏదీ? చూడవచ్చునా?" అని బలరామకృష్ణులు అమాయికంగా అనేసరికి, రక్షకభటులు వాళ్ళను విల్లున్న చోటికి తీసుకుపోయారు. అది బ్రహ్మాండమైన విల్లు; తక్షకుడి శరీరంలాగున్నది.

దాన్ని చూసి కృష్ణుడు, "దీన్ని ఎక్కుపెట్టటం దేవతలకూ, దానవులకూ కూడా సాధ్యం కాదంటారే. నిజం ఏమిటో చూస్తాం," అంటూ ఆ విల్లును ఒక్కచేత అవలీలగా ఎత్తి, చులాగ్గా నారి సంధించి మీటాడు. అది చేసిన మోత భయంకరంగా అన్ని దిక్కులా ప్రతిధ్వనించింది. అక్కడ ఉన్నవారంతా నిర్ఘాంతపోయి చూస్తూండగా, కృష్ణుడు ఆ వింటిని తన పిడికిటపట్టి పెళుక్కున విరిచేశాడు. గొప్ప ఉత్సవం చేసుకోనున్న ఆ విల్లు కాస్తా ముక్కలుముక్కలయింది. కృష్ణుడు తనకేమీ తెలియనట్టు చల్లగా జనంలో కలిసిపోయి ఆయుధాగారం నుంచి బయట పడ్డాడు. ఆయుధాగారాన్ని రక్షించే భటులు ఒకరి కన్న ఒకరు ముందు పరిగెత్తి కంసుడి అంతఃపురానికి వెళ్ళి, జీరపోయిన గొంతులతో, జరిగిన సంగతంతా కంసుడికి నివేదించారు.





# అరణ్యపురాణం

## 13

బలదేవుడూ, బొగ్గులవాళ్ళూ ఒకరి వెనక ఒకరుగా బారులో నడుస్తూ వెళ్ళిపోయారు.

"నేను వెంటనే మనిషిమందను చేరాలి," అన్నాడు మౌగ్లీ చివరకు.

"మరి వీళ్ళ మాటేమిటి?" అన్నాడు పెద్దన్న, వెళ్ళిపోతున్న బొగ్గులవాళ్ళ కేసి ఆకలిగా చూస్తూ.

"చీకటి పడే దాకా వాళ్ళు గ్రామ ద్వారం చేరకుండా నువ్వు ఆపగలవా?" అన్నాడు మౌగ్లీ.

"వాళ్ళను గానుగెద్దుల్ని తిప్పినట్టు గుండ్రంగా ఒకే దారిలో నడిపించమంటే నడిపించనూ?" అన్నాడు పెద్దన్న.

"అదేమీ అవసరం లేదు గాని, కాస్త పాట పాడి కొంచెం ఉత్సాహం ఇస్తే చాలు. పాట అటే ఇంపుగా ఉండ పనిలేదు. బాఘీరా, నువు కూడా వాళ్ళ వెంట ఉంటావు కదూ? చీకటి పడ్డాక నన్ను గ్రామం సమీపంలో కలవండి. ఆ చోటు పెద్దన్నకు తెలుసు," అన్నాడు మౌగ్లీ.

అరణ్యం కుండా పరిగెత్తుతూ మౌగ్లీ తన ముందు నడిచే నలుగురు బొగ్గుల వాళ్ళనూ, భుజాన పెట్టుకున్న తుపాకీ గొట్టం అన్నివైపులకూ ఊపుకుంటూ నడిచే బలదేవుణ్ణీ చూశాడు. అతని వెనకనుండి అతని మిత్రులు "పాట" ప్రారంభించారు. బాఘీర తల వంచి అరణ్యమంతా దద్దరిల్లే టట్టు పెడబొబ్బ పెట్టాడు. అన్నలు వెయ్యి తోడేళ్ళకు సమంగా పెట్టిన కేకలు అరణ్యం అన్ని వైపుల నుంచీ ప్రతిధ్వనించాయి.

బొగ్గులవాళ్ళూ, బలదేవుడూ అదిరి పోయి, ఎండి పోయిన మండలను పెళ పెళా తొక్కుకుంటూ అందిన చెట్లెక్కే శారు. బలదేవుడు మంత్రాలు చదివాడు.

అట్ట చివరి బొమ్మ



మౌగ్లీ ఒక్కొక్క మైలే గడిచి ముందుకు పోతున్నాడు. మెస్సువానూ, ఆమె భర్తనూ నిర్బంధం నుంచి తప్పించాలన్న ఆలోచన తప్పిస్తే అతని తలలో మరేదీ లేదు.

మునిమాపు వేళకు అతను పశువులు మేసే బీళ్ళు చేరుకున్నాడు. అతనికి మనిషి జాతి పైన ఆగ్రహం ఉన్నప్పటికీ, గ్రామం లోని ఇళ్ళ కప్పులు చూసే సరికి అతని గుండె గొంతులో కొట్టుకున్నది. ఇవాళ గ్రామస్థులందరూ రోజు కన్న చాలా పెంద లాడే పొలాల నుంచి గ్రామానికి తిరిగి వచ్చి వంటలూ, వార్పులూ చూసుకోక, అందరూ చెట్టు కింద చేరి తెగ వాగుతున్నారు.

"ఈ మనుషులకు మనుషులను వేటా డకపోతే తోచదు. నిన్న నన్ను వేటాడారు. ఇవాళ మెస్సువానూ, ఆమె భర్తనూ బోనులో పెట్టారు. రేపు మళ్ళీ నా కోసం ఉచ్చుపన్నుతారు," అనుకున్నాడు మౌగ్లీ.

అతను గోడ వెంబడే పాకుతూ వెళ్ళి, మెస్సువా ఉండే గుడిసె చేరుకుని, కిటికీ కుండా లోపలికి చూశాడు. మెస్సువా నేల మీద పడి ఉన్నది. ఆమె చేతులూ, కాళ్ళూ బంధించి, నోట గుడ్డలు కుక్కారు. ఆమె అతి కష్టం మీద ఊపిరి తీస్తూ, మూలుగు తున్నది. ఆమె భర్తను మంచాని కేసి కట్టారు. ఇంటి తల వాకిలి బంధించి ఉన్నది. దాని బయట ముగ్గురు నలుగురు మనుషులు కాపలా ఉన్నారు.

గ్రామస్థుల అలవాట్లూ, ఆచారాలూ మౌగ్లీకి బాగా తెలుసు. తినటమూ, వాగ టమూ, పొగ తాగటమూ సాగినంత కాలమూ వాళ్ళు మరే పనీ తల పెట్టరు. తిండి తిన్నాక వాళ్ళు అపాయకరంగా తయారవుతారు. కొంతసేపటికి బలదేవుడు వచ్చి చేరుతాడు.

మౌగ్లీ కిటికీ కుండా లోపల ప్రవేశించి మెస్సువానూ, ఆమె భర్తనూ కట్లు విప్పి, పాలేమైనా ఉన్నాయేమోనని చూశాడు. అతను చప్పున నోరు ముయ్యకపోతే

మెస్సువా కేక పెట్టి ఉండేదే. ఆమెకు బాధతో మతి సగం పోయి ఉన్నది. ఆ ఉదయం గ్రామస్థు లామెను కర్రలతోనూ, రాళ్ళ తోనూ తీవ్రంగా కొట్టారు. ఆమె భర్త కోపం లోనూ, సంభ్రమంలోనూ ఉన్నాడు.

"నాకు తెలుసు — వస్తాడనుకుంటూనే ఉన్నాను. నిశ్చయంగా నా కొడుకే!" అని వెక్కుతూ, మెస్సువా మౌగ్లీని గట్టిగా కౌగ లించుకున్నది. అంతదాకా నిశ్చలంగా ఉన్న తనకు ఒళ్ళంతా వొణుకు పుట్టటం చూసుకుని మౌగ్లీ ఆశ్చర్యపోయాడు.

"ఈ కట్లన్నీ ఏమిటి? వాళ్ళు నిన్నెందు కిలా బంధించారు?" అని అతను అడిగాడు.

"ఇంకెందుకు? నిన్ను నా కొడుకును చేసుకున్నామని మమ్మల్ని చంపటానికి! చూడు, రక్తం!" అన్నాడు మెస్సువా భర్త ఉసడింపుగా.

మెస్సువా ఏమీ అనలేదు. అతను ఆమె గాయాలే పరీక్షించాడు. రక్తం చూసి అతను పళ్ళు కొరకటం భార్యాభర్త లిద్దరికీ విని పించింది.

"ఇది ఎవరు చేసిన పని? ఈ బాకీ చెల్లు వేసి తీరాలి," అన్నాడు మౌగ్లీ.

"ఊరంతా కలిసే చేశారు. నేను మరీ ధనికుణ్ణి. నాకు మరీ చాలా పశువులున్నాయి.



అందుకని, నీ కాశ్రయం ఇచ్చి అదీ, నేనూ మాయలమారి వాళ్ళ మయాం," అన్నాడు మెస్సువా భర్త.

"నా కేమీ అర్థం కాలేదు. జరిగిన దేమిటో మెస్సువాను చెప్పనీ," అన్నాడు మౌగ్లీ.

"నేను నీకు పాలిచ్చాను, జ్ఞాపకం ఉందా, నత్తూ? ఆ పులి పట్టుకు పోయిన నా కొడుకువు నువు. నువ్వంటే నాకు ప్రాణం. అందుకని, నేను దయ్యానికి తల్లిననీ, చంపెయ్యాలిసిందేననీ అన్నారు, వాళ్ళు," అన్నది మెస్సువా.

"చావంటే ఏమిటో నాకు తెలుసు. దయ్యమంటే ఏమిటి?" అని మౌగ్లీ అడిగాడు.



మెస్సువా భర్త తల ఎత్తి విచారంగా చూశాడు. కాని మెస్సువా నవ్వి, తన భర్తతో, "చూశావా? నే నెరుగుదును. వీడు మాయ దారికాడు—నా కొడుకే!" అన్నది.

"కొడుకో, మాయదారో, ఏమైతే మనకేం పోరిగింది? మనం చచ్చిన వాళ్ళ కింద జమే," అన్నాడు మెస్సువా భర్త.

మౌగ్లీ కిటికీలో నుంచి చూపిస్తూ, "అదే అరణ్యానికి దారి. మీ కాళ్ళకూ, చేతులకూ స్వేచ్ఛ వచ్చింది. వెళ్ళిపొండి," అన్నాడు.

"నీకు తెలిసినట్టుగా మాకు అరణ్యం తెలీదురా, బాబూ. నే నెక్కువ దూరం నడవగలనని తోచదు," అన్నది మెస్సువా.

"అదీగాక ఊళ్ళో ఉన్న ఆడా మగా మా మీద విరుచుకుపడి, మమ్మల్ని తిరిగి తెస్తారు," అన్నాడు ఆమె భర్త.

మౌగ్లీ తన కత్తి మొనతో అరిచేతిని గీరుతూ, "ఎవరినీ ఏమీ చెయ్యాలనే ఉద్దేశం నాకు లేదులే — ఇప్పుడప్పుడే! అయినా మిమ్మల్ని ఎవరూ అడ్డగిస్తారను కోను. అదీగాక, త్వరలోనే వాళ్ళకు బోలెడంత ఇతర పని తగులుతుంది," అని అతను తల ఎత్తి, వెలపల కోలాహలం ఆలకించి, "ఓహో, మా వాళ్ళు బలదేవుణ్ణి వదిలేశారన్నమాట!" అన్నాడు.

"నిన్ను చంపమని ఉదయం అతన్ని పంపారు. నీకు కనిపించాడా ఏం?" అన్నది మెస్సువా ఆదుర్దాగా.

"ఆ, కనిపించాడు. అతనొక విచిత్రమైన కథతో వచ్చి ఉంటాడు. ఆ కథ పూర్తి అయేలోపుగా మనం చెయ్యవలిసింది బోలెడున్నది. నేను వెళ్ళి జనం ఏం చెయ్య దలిచారో తెలుసుకుని వస్తాను. ఈలోగా మీరు ఎక్కడికి వెళ్ళదలిచినదీ నిశ్చయించుకుని, నాకు చెప్పండి," అని మౌగ్లీ బయటికి పోయి, గ్రామప్రాకారం వెంబడి పాకుతూ, చెట్టు కింది జనం చెప్పేది వినిపించే దూరంలో ఆగాడు. —(ఇంకావుంది)



# 67. అందమైన గ్రీకుశిల్పం

క్రీస్తు పూర్వం నాలుగు శతాబ్దాల నాటి సమాధి రాయిపై ఈ అద్భుతమైన ప్రతిమలు చెక్కి ఉన్నాయి. ఇందులో అలంకరించుకునే స్త్రీ, ఆమెకు సహాయం చేస్తున్న పరిచారికా ఉన్నారు. గ్రీకు శిల్పాలన్నింటిలోనూ దుస్తులను మలచడం ఒక ప్రత్యేకతగా ఉంటుంది. అదే ఇందులోనూ ఉన్నది.



Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

అమ్మ తెచ్చింది తిను

పంపినవారు :
బి. కృష్ణదాసు, గుంటకల్లు

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

అయ్యచెప్పింది విను

పంపినవారు:
బి. కృష్ణదాసు, గుంటకల్లు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అమ్మతెచ్చింది తిను

రెండవ ఫోటో : అయ్యచెప్పింది విను

పంపినవారు : భూషి కృష్ణదాసు,

506–శాంతినగర్, గుంటకల్లు.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# AWARDS!

# WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST
ONLY
WE DO OUR BEST





PRASAD PROCESS PRIVATE LTD
CHANDAMAMA BUILDINGS MADRAS-26

